18-12-1992 శుక్రవారం 12 పేజీలు సంపుటి : 63 సంచిక :51 విడిప్రతి : రు. 2.00

# జమీన్ రైతు

స్థాపకుడు : నెల్లూరు వెంకటరామానాయుడు



### పివిపై కక్ష తీర్చుకోను వైఎస్ నడుంకట్టిన నూతన ప్రయత్నం

# ఆంధ్ర ఎమ్పీలలో అర్జున్ వర్గం

దేశంలో శాంతిభద్రతల పరిస్థితి నిదానంగా మెరుగువుతున్నా కాంగ్రెస్ పార్టీ నాయకత్వ సంక్షోభం మాత్రం రగుల్కుంటూనే వుంది. ప్రధాన మంత్రి పి.వి. నరసింహారావు నాయకత్వాన్ని దెబ్బతీసే రాజకీయాలతో దేశ రాజధాని వేడెక్కి వుంది. పార్టీలో ఐక్యత రక్షిస్తూనే పి.వి.ని అధికారం నుంచి తప్పించడానికి కుట్ర జరుగుతోంది. సీనియర్ నాయకులు నారాయణ్ దత్ తివారీ, అర్జున్ సింగ్ ఇప్పటికే పలుమార్లు సమావేశాలు జరిపి పి.వి.ని గద్దె దించే వ్యూహం రూపొందించినట్లు తెలుస్తోంది. ఇందులో భాగంగానే మెజార్టీ ఎంపీలను తమ వైపుకు లాక్కొని పి.వి.ని మైనార్టీలో పడేయాలన్న యత్నాలు జరుగుతున్నాయి. పి.వి. వ్యతిరేక గ్రూపుకు రాజీవ్‌గాంధీ సతీమణి శ్రీమతి సోనియాగాంధీ ఆశీస్సులు కూడా వున్నట్లు ప్రచారం జరుగుతుండటంతో పి.వి. పరిస్థితి ఇరకాటంలో పడింది. పి.వి. మీద వ్యతిరేకత వుండి ఇన్నాళ్లూ మౌనంగా వున్న వారంతా ఇప్పుడు ఒకే గొడుగుకిందకు వస్తున్నారు. మెజార్టీ కాంగ్రెస్ ఎంపీలు దక్షిణాదికి చెందిన వారు కావడంతో పి.వి. వ్యతిరేక గ్రూపు దక్షిణాది ఎంపీలకు గాలం వేయడంలో నిమగ్నమై వుంది. ఇందులో భాగంగానే ఆంధ్రప్రదేశ్ ఎంపీల సమీకరణ మొదలైంది. రాష్ట్రానికి చెందిన ఎంపీ డాక్టర్ వై.ఎస్. రాజశేఖర రెడ్డికి మొదటి నుంచీ అర్జున్ సింగ్‌తో సత్సంబంధాలున్నాయి. ఇటీవల పార్లమెంటు సెంట్రల్ హాలులో అయోధ్య విషయమై డాక్టర్ రాజశేఖర రెడ్డి ప్రధానమంత్రి వైఖరిని తీవ్రంగా దుయ్యబట్టారట. ఆ తర్వాత అర్జున్ సింగ్ ఇంట్లో జరిగిన సమావేశంలో వై.ఎస్. పాల్గొన్నారు. అప్పటి నుంచీ ఎంపీలను కూడగట్టే కార్యక్రమంలో వై.ఎస్. తలమునకలై వున్నారు. వై.ఎస్. కదలికల పై ముఖ్యమంత్రి కోట్ల విజయభాస్కర రెడ్డి ఒక కన్నేసి వుంచారు. అర్జున్ సింగ్‌కు కోట్లకు చుక్కెదురు కావడం వల్ల పి.వి.ని రక్షించుకోవాలని ముఖ్యమంత్రి యత్నిస్తున్నారు. రాష్ట్రానికి చెందిన కేంద్ర మంత్రులు మల్లికార్జున్, వెంకటస్వామి, కమాలుద్దీన్ ప్రభృతులతో కోట్ల ఇప్పటికే చర్చించారు. రాష్ట్రానికి చెందిన కాంగ్రెస్ ఎంపీలతో కూడా కోట్ల మాట్లాడుతున్నారు. వై.ఎస్. మద్దతుదారులు సుమారు ఎనిమిది మంది ఎంపీల్లో పి.వి. వైపుకు ఎంత మంది మొగ్గుచూపుతారన్నది ఆసక్తికరంగా తయారైంది. మాజీ ముఖ్యమంత్రి ఎన్. జనార్ధన రెడ్డి కూడా పి.వి.ని నిలబెట్టేందుకు తన వంతు కృషి చేస్తున్నారట. ఇలా వుండగా ఈ నెల 14 తేదీన ఢిల్లీలో జరిగిన కాంగ్రెస్ పార్లమెంటరీ పార్టీ వర్కింగ్ కమిటీ సమావేశానికి కోట్ల హాజరయ్యారు. ఈ సందర్భంగా రాష్ట్రంలో కొందరు ఎంపీల కదలికలు, వై.ఎస్. వైఖరి పై కోట్ల ప్రధాని పై ఫిర్యాదు చేశారట.

### వాడిగా వేడిగా శీతాకాల సమావేశాలు

రాష్ట్రరాజధానిలో ఒకవైపు చలి వణికిస్తున్నా మరో వైపు శాసనసభ సమావేశాలు 'వేడి' పుట్టిస్తున్నాయి. చలికాలంలో శాసనసభ సమావేశాలు జరిగి దాదాపు పది సంవత్సరాలైంది. 'కోట్ల' పుణ్యమా అంటూ శీతాకాల సమావేశాలు ఏర్పాటు కూడా కాగా మొదటి రోజునే సభ మూడు సార్లు వాయిదా పడింది. అయోధ్యలో మసీదు కూల్చిన

కొరవ 7 పేజీలో

# ఐఎఎస్ అధికార్లు కారాలు నూరుతున్నారు!

ముఖ్యమంత్రి కోట్ల విజయభాస్కర రెడ్డి తమ పట్ల అనుసరిస్తున్న వైఖరికి నిరసనగా ఐ.ఎ.ఎస్. అధికారుల్లో ఒక వర్గం సహాయ నిరాకరణకు సమాయత్తమవుతోంది. ఇటీవలి పెద్ద ఎత్తున జరిగిన బదిలీల్లో పనిగట్టుకొని ఒక వర్గం వారిని ప్రాధాన్యత లేని పోస్టుల్లో నియమించడంతో ఆ వర్గానికి చెందిన ఐ.ఎ.ఎస్. అధికారులు ముఖ్యమంత్రి పైన కారాలు, మిరియాలు నూరుతున్నారు. నేదురుమల్లి జనార్ధన రెడ్డి ప్రభుత్వంలో ఒక వెలుగు వెలిగిన సీనియర్ ఐ.ఎ.ఎస్. అధికారులను కూడా ఇటీవల బదిలీల్లో అజ్ఞాతవాసం పట్టించారు. బదిలీల అనంతరం రాష్ట్ర ప్రభుత్వ యంత్రాంగంలో స్తబ్దత నెలకొన్నది. ముఖ్యమంత్రి గనుక తన వైఖరిని మార్చుకోని పక్షంలో త్వరలోనే తమ సంఘసమావేశాన్ని ఏర్పాటు చేసి నిరసన వ్యక్తం చేయాలని ఐఎఎస్ అధికారులు యోచిస్తున్నారు. అప్పటికీ కోట్లధోరణి మారకపోతే ఈ వ్యవహారాన్ని ప్రధాన మంత్రి దృష్టికి తీసుకు వెళ్లాలని వారు నిర్ణయించారు.

ఈ నెలలో పదవీ విరమణ చేస్తున్న రాష్ట్ర ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి దీక్షిత్ అరోరా, ముఖ్యమంత్రి అంతరంగికుడైన ఇంటలిజెన్సు ఐ.జి. ఆంజనేయ రెడ్డి తమకు గిట్టని ఐ.ఎ.ఎస్. అధికారుల గురించి ముఖ్యమంత్రి చెవులు కొరుకుతున్నారని, వీరి ప్రోద్బలంతోనే ముఖ్యమంత్రి బదిలీల్లో తప్పటడుగు వేశారని ఐ.ఎ.ఎస్. అధికారులు ఆరోపిస్తున్నారు. అరోరా పదవీ విరమణ తర్వాత సీనియారిటీ ప్రకారం సంతానం ప్రధాన కార్యదర్శి కావల్సి వుంది. మరో ఎనిమిది నెలల్లో రిటైర్ అవుతున్న సంతానంకు ప్రధాన కార్యదర్శి పదవి దక్కకుండా చేసేందుకే, పదవీ విరమణ చేస్తున్న అరోరాకు మరో ఏడాది పాటుసర్వీసు పొడిగించాలని ముఖ్యమంత్రి నిర్ణయించారు. ఇటీవలి మంత్రివర్గ సమావేశంలో అరోరా సర్వీసు పొడిగిస్తున్నట్లు ముఖ్యమంత్రి చెప్పినట్లు తెలుస్తోంది. అందుకు అనుగుణంగానే కమిషనర్ ల్యాండ్ రెవిన్యూ వంటి కీలకమైన పోస్టులో వున్న సంతానంను కేంద్ర రాష్ట్ర సంబంధాల సమన్వయాధికారి పేరుతో పనిపాటాలేని పోస్టు కొత్తగా సృష్టించి పక్కకు తోసేశారు. అంతటితో వదలకుండా గతంలో సంతానం పై వచ్చిన భూకబ్జా కేసును తిరగదోడి ఇరకాటంలో పెట్టే ప్రయత్నాలు కూడామొదలైనట్లు తెలుస్తోంది. సంతానం తర్వాత సీనియర్, జనార్ధన రెడ్డి సన్నిహితుడైన వళియప్పన్‌ను గోదావరి లోయ అభివృద్ధి పథకం అధ్యక్షుడిగా నియమించారు. సాధారణంగా రిటైర్ అయిన అధికారులను తిరిగి నియమించే ప్రశ్నే లేదని చెబుతున్న ముఖ్యమంత్రి పనిగట్టుకొని అరోరా విషయంలో మినహాయింపు ఇవ్వటం దురుద్దేశంతో కూడిన చర్య అని ఐఎఎస్ అధికారులు అంటున్నారు. అక్టోబర్ నెలలో రిటైర్ అయిన ఆర్ అండ్ బి చీఫ్ ఇంజనీర్ జయశంకర్ రెడ్డిని తిరిగి నియమిస్తూ నేదురుమల్లి జనార్ధన రెడ్డి చేసిన ఆర్డర్‌ను కోట్ల రద్దు చేశారు. గతనెలలో రిటైర్ అయిన ఐఎఎస్ అధికారి కుమారస్వామిరెడ్డి సర్వీసు పొడిగింపుకు చేసుకున్న ప్రయత్నాలను కోట్ల తిరస్కరించారట. అలాగే నేదురుమల్లి ప్రభుత్వంలో పునర్నియమింపబడిన 70 మంది రిటైర్డ్ అధికారులను సర్వీసు నుంచి తొలగించేందుకు కూడా నిర్ణయించిన కోట్ల ఇప్పుడు అరోరాకు వత్తాసు పలకడం "కుట్ర" గాక మరేమిటని? ఐఎఎస్ అధికారులు ప్రశ్నిస్తున్నారు.

## ఎమ్మెల్యే ద్వయానికి అంకుశం వలె గుచ్చుకుంటున్న అన్సారీ నివేదిక

# అత్తమీద కోపం దుత్తపైనా?

రాజీవ్ గాంధీ హత్యానంతరం జరిగిన అల్లర్లపై విచారణకు నియమించిన అన్సారీ కమిషన్ రిపోర్టులో



హైదరాబాదు ఎమ్మెల్యేలు పి. సుధీర్ కుమార్, ముఖేష్‌లు దోషులని నిర్ధారించటంతో రాజధాని రాజకీయం వేడెక్కింది. రాజీవ్ గాంధీ హత్య జరిగిన రాత్రి నగరంలో ఎన్టీఆర్‌కు చెందిన రామకృష్ణ థియేటర్‌ను స్థానిక ఎమ్మెల్యేలు విధ్వంసం చేసినట్లు అప్పట్లో ఆరోపణలు వచ్చాయి. దీని పై తెలుగుదేశంతో పాటు ఇతర ప్రతిపక్ష పార్టీలు పెద్ద ఎత్తున ఆందోళన జరిపిన దరిమిలా అప్పటి ముఖ్యమంత్రి నేదురుమల్లి జనార్ధన రెడ్డి అల్లర్లపై విచారణకు జస్టిస్ అన్సారీ కమిషన్‌ను నియమించారు. జనార్ధన రెడ్డి అధికారంలో వుండగానే ఈ కమిషన్ తన నివేదికను సమర్పించింది. అయితే జనార్ధన రెడ్డి దీని పై ఎటువంటి నిర్ణయం తీసుకోకుండా తొక్కి వుంచారు. ఇటీవలి మంత్రి వర్గ సమావేశంలో కొత్త ముఖ్యమంత్రి కోట్ల అన్సారీ కమిషన్ రిపోర్టుకు ఆమోద ముద్ర వేయించారు. ఈ నెల 14 నుంచి ప్రారంభం కానున్న అసెంబ్లీ సమావేశాల్లో రిపోర్టును వెల్లడించ



గలమని కూడా కోట్ల ప్రకటించడంతో దోషులుగా పేర్కొనబడిన స్థానిక కాంగ్రెస్

కొరవ 11 పేజిలో

## జిల్లా రాజకీయాలు

# కళ్లెం లేని గుర్రాల పై స్వారీ సోమిరెడ్డి తరమా?

జిల్లా తెలుగుదేశం అధ్యక్షుడుగా శ్రీ సోమిరెడ్డి చంద్రమోహన్ రెడ్డిని నియమించారు. ఏడాది పై నుంచి ఈ ముళ్ల కిరీటం నెత్తిన అలంకరించుకునే నాయకుడి కోసం గండిపేట రాజకీయ దురంధరులు కాగడాలు వేసి మరీ వెతికారు. ఎవర్ని పిల్చి పెత్తనం తీసుకోమన్నా మా కొద్దు బాబోయ్ అని పారిపోయే వారు. వెతికి, వెతికి వేసారి పోయి చివరకు చంద్రమోహన్ రెడ్డి



తలపైన తటాలున ఆ కిరీటాన్ని పెట్టేసింది అధిష్టాన వర్గం.

చంద్రమోహన్ రెడ్డి మొదట్లోనే ఈ పదవికి ఆశపడకపోలేదు. కాని ఆయనంటే గిట్టనివారు కొందరు అన్నగారి దగ్గరకు వెళ్లి గత చరిత్రను ఏకరువు పెట్టారట. అందులో అతి ముఖ్యమైనది— [illegible] సమయంలో కోఆపరేటివ్ [illegible] ఛైర్మన్ గదిలో వుండిన ఎన్టీఆర్ ఫోటోను క్రింద పడేసి, కాలితో త్రొక్కి, అవమానించాడన్నది. మేనమామతో కలసి ఒక సారి పార్టీ నుంచి బయటకు వచ్చి, తిరిగి పునఃప్రవేశం చేసిన మచ్చ కూడా చంద్రమోహన్ రెడ్డి పై వుంది. ఈ రెండు సంఘటనలు విన్పించగానే ఎన్టీఆర్ క్రుద్ధుడై, హుంకారం చేశాడట. ఇప్పుడదే ఎన్టీఆర్ అదే చంద్రమోహన రెడ్డిని నీవే తప్ప శరణం వేరే లేదని పార్టీ అధ్యక్షుడ్ని చేశాడు.

వెనుకనున్న ఈ రెండు మచ్చలు మరచి పోతే, చంద్రమోహన్ రెడ్డి ప్రతిపక్ష పార్టీ జిల్లా అధ్యక్షత నెరపగల అర్హత కలవాడే! మేనమామ వారసత్వం వల్లనేమో— ఏ సందర్భమూ లేకుండా పత్రికలలో నిత్యం దర్శనం ఇవ్వగల వాకచక్యం వుంది; పచ్చి అబద్ధాన్నికూడా పరమ సత్యం వలె సవివరణాత్మకంగా చెప్పి, ఎదుటి వాడిని నమ్మించగల వాణక్యం వుంది; రాత్రి పగలు విరామం లేకుండా తిరిగి పని చేయగల ఓర్పు వుంది; బెట్టు, బిడియం లేకుండా ఎవరి దగ్గరకైనా వెళ్లి పని జరిపించుకోగల రాజకీయ పరిపక్వత వుంది. అయితే చంద్రమోహన్ రెడ్డికి లేనిదల్లా – స్థాయి! జిల్లా నాయకత్వం నెరపగల్గిన వయస్సు, అనుభవం, స్థాయి అతడికి లేవు. పార్టీలో పండు ముదుసలులైన ధనెంకుల వంటి వారి నుంచి, రాజకీయంగా పాలు త్రాగే వయసులో వున్న డాక్టర్ల జంట వరకు ఎన్నో రకాల వ్యక్తిత్వం, అంతస్తులు కల్గిన నాయకులున్నారు. దేగా, ఎస్‌సి, కొండపనాయుడు వంటి జగజ్జెట్టీలున్నారు. ఎన్టీఆర్‌ను తప్ప మరెవ్వనీ నాయకుడిగా భావించలేని రమేష్‌రెడ్డి వంటి వారున్నారు. వైటివాయుడు, పెళ్లకూరు ప్రభాకర రెడ్డి, కంభం విజయరామరెడ్డి వంటి యువకులున్నారు. వీరందరూ కళ్లెంలేని గుర్రాల వలె పరుగులు తీసేవారు. వీరిలో ఏ పరిశాతమైనా చంద్రమోహన్ రెడ్డిని నాయకుడిగా అంగీకరించి, మాటవినే పరిస్థితి వుంటుందని వూహించలేము. కార్యకర్తల నుండి కూడా చంద్రమోహన రెడ్డి ఇటువంటి పరిస్థితినే ఎదుర్కోవలసి వుంటుంది.

ఇంకొక ప్రక్క జిల్లాలో కాంగ్రెస్ పార్టీ బలీయమైనది. ఎమ్మెల్యేలు, మంత్రులు, ఎన్నియో యుద్ధముల ఆరితేరిన ఆనం సంజీవ రెడ్డి వంటి యోధానుయోధులువున్న పార్టీ అది. పైగా అధికారంలో వుంది. మరి ఈ కొండను ఢీకొనే పొట్టేలుకు వుండవలసిన ధైర్య, సాహసాలు చంద్రమోహన్ రెడ్డిలో వున్నాయా? ఏమో!

మొన్న కర్ఫ్యూ సమయంలో పోలీసు దెబ్బ రుచి చూడడం కూడా

కొరవ 11 పేజిలో

# జమీన్‌రైతు

## ఇంకా పెద్ద తప్పు!

బిజెపి పాలిత రాష్ట్ర ప్రభుత్వాలను రద్దు చేసి పివి నరసింహారావు సరిదిద్దుకోలేని తప్పిదం చేశారు. అయోధ్య పరిణామాల ప్రభావం ఫలితంగా తనలో చెలరేగిన మానసిక అశాంతి, అయోమయ పరిస్థితి, పదవీ భ్రష్టత్వ భీతితో ఆయన అనుసరిస్తున్న అసహన వైఖరికి ఇదొక నిదర్శనం. సంక్షోభ సమయంలో దృఢ చిత్తంతో, నిగ్రహంతో, సంయమనంతో నిర్ణయాలు తీసుకోగల్గిన వారే నాయకులుగా పరిగణించబడతారు; పి.వి.లో ఇప్పుడు ఆ మూడూ లోపిస్తున్నాయి. తన అవగాహనా పరిధిలో నిర్ణయాలు తీసుకోవడం కాక, తన పదవికి ఎసరు పెట్టగల వారు, లేదా రక్షించ గల్గిన వారు ఏది కోరితే అది చేయవలసిన నిస్సహాయ స్థితికి దిగజారిపోయినట్లున్నారాయన.

అయోధ్య విషాద ఘటనలకు నూటికి నూరుపాళ్లు తప్పు బిజెపిదే! మతం ముసుగులో రాజకీయాధికార సముపార్జనకు వారు పన్నిన కుట్ర వల్లనే దేశమీనాడు మత కలహాగ్నిలో మాడి మసై పోతున్నది. వందలాది అమాయక ప్రాణాలు అన్యాయంగా ఆ మారణ హోమానికి సమిధలై పోతున్నాయి. కాని ఏ ప్రభుత్వమూ, ఏ చర్యా తీసుకోలేని రీతిలో మహావటవృక్షం వలె ఎదిగిపోయి వుంది బిజెపి పార్టీ. అందుకే పివి కూడా వారిని వదిలేసి, వారి అనుబంధ సంస్థలైన ఆర్‌ఎస్‌ఎస్, విహెచ్‌పి, భజరంగ్ దళ్‌లను నిషేధించారు. నిషేధించిన సంస్థలతో సంబంధాలు కల్గిన వ్యక్తులు రాష్ట్ర ప్రభుత్వాలకు అధినేతలుగా వుండడం చట్ట సమ్మతమా అని మానవ వనరుల మంత్రి అర్జున్‌సింగ్ ధర్మసందేహం లేవనెత్తారు. ఆయనకు బిజెపి పై వ్యక్తిగత ద్వేషం వుంది. బిజెపిని ఆజన్మ శత్రువుగా భావించే సిపిఎం కూడా ఈ అవకాశాన్ని తీసుకొని పివి పై ఒత్తిడి తెచ్చింది. తను దిగితే ఆ కుర్చీ పై ఎగిరి కూర్చోవాలని తపన పడే వారొకప్రక్క, అవసరంలో బాసటగా నిలుస్తామని ప్రమాణం చేసే పార్టీ ఇంకొక ప్రక్క ఒత్తిడి తేవడంతో పివి నిలువరించు కోలేక పోయాడు. అందులోనూ తొందరపాటే; నిషేధించిన సంస్థలతో సంబంధం కల్గిన వ్యక్తులు ప్రభుత్వంలో వుండరాదనుకుంటే, ఆ విషయం నిరూపించి, వారిని తొలగించి వుండాల్సింది. కాని, అది కాల వ్యవధి తీసుకునే పద్ధతి కాబట్టి, బిజెపి పాలిత రాష్ట్రాలలో శాంతి భద్రతల పరిస్థితి క్షీణించిందనే కుంటి సాకుచూపి, గవర్నర్ల నుంచి నివేదిక తెప్పించి, రాజ్యాంగంలోని 356 ఆర్టికల్ క్రింద రద్దుచేశారు. ఇది అన్యాయమైన సాకు. అయోధ్య అల్లర్లు మధ్యప్రదేశ్, హిమాచల్ ప్రదేశ్, రాజస్థాన్‌లలోనే కాదు – దేశమంతటా జరుగుతున్నాయి. కాంగ్రెస్ అధికారంలో వున్న మహారాష్ట్ర, కర్ణాటక, గుజరాత్ లలో జరిగిన విధ్వంసంతో పోల్చితే ఆ మూడు రాష్ట్రాలలో జరిగింది చాలా తక్కువ. పై పెచ్చు ఆ రాష్ట్ర ప్రభుత్వాలు కేంద్ర ఆదేశాలను తుచ తప్పక పాటించాయి. తమ రాష్ట్రాలలో ఆర్‌ఎస్‌ఎస్ నాయకులను అరెస్ట్ చేశాయి. అల్లర్లు అణచడానికి సైన్యాన్ని దింపాయి. ఈ నేపథ్యంలో శాంతిభద్రతల సాకు చూపి ప్రభుత్వాలను రద్దు చేయడం తీవ్ర విమర్శలకు దారి తీస్తున్నది. అయోధ్య ఘోరానికి కారకులై ప్రజల ఈసడింపుకు గురౌతున్న బిజెపి పట్ల ప్రజలలో సానుభూతి పెంచేందుకు తోడ్పడుతున్నదీ చర్య. కనీసం ఆ రాష్ట్రాల అసెంబ్లీల జోలికి పోకుండా వుండినా కొంత నయంగా వుండేది. ముఖ్యమంత్రులు ఆర్‌ఎస్‌ఎస్ సభ్యులైనంత మాత్రాన, ప్రజాస్వామ్య బద్ధంగా ఎన్నికైన శాసనసభలు ఏమి నేరం చేశాయి? వాటిని రద్దు చేయవలసిన అవసరం ఏమిటి? ఆ కోణం నుంచి ఆలోచిస్తే మహారాష్ట్ర, పశ్చిమబెంగాల్ అసెంబ్లీలనూ రద్దు చేయాలి కదా? అసలు మసీదు ధ్వంసాన్ని నిస్తేజంగా, నిస్సహాయంగా పరికించిన కేంద్ర ప్రభుత్వాన్ని కూడా రద్దు చేయాలి కదా?

కేవలం వారు అధికారంలో వున్న రాష్ట్రాలలోని ప్రభుత్వాలను రద్దు చేయడం బిజెపి పార్టీకి శిక్ష కాదు. జాతి సమైక్యతకు, సమగ్రతకు, మత సామరస్య వాతావరణానికి వారు కల్గించిన విఘాతం, తలపడిన దేశద్రోహం ఇటువంటి స్వల్ప చర్యల వల్ల పరిహారం కావు. పై పెచ్చు అది వారి కుత్సిత పథకాల విజయానికి మరింత దోహద పడుతుంది. బిజెపికి తగిన శిక్ష – వారిని ప్రజల నుండి దూరం చేయడమే! అయోధ్యను అడ్డం పెట్టుకొని వారు నడిపిన కుట్రలు, పన్నిన నీచ పథకాలు ప్రజలకు సవివరంగా తెల్పి, మత సామరస్యాన్ని, మనసా వాచా నమ్మే లౌకిక శక్తులన్నింటినీ కలుపుకొని, పార్టీ రాజకీయాలకతీతంగా బిజెపి పై పోరాటం జరిపి, వారికి పుట్టగతులు లేకుండా చేయడమే ఇప్పుడు జరగాల్సిన కార్యక్రమం. భవిష్యత్‌లో మరే పార్టీ కూడా మతాన్ని అడ్డుపెట్టుకొని అధికారంలోకి రావడానికి ప్రయత్నించే సాహసం చేయకుండా గుణపాఠం చెప్పే రీతిలో వుండాలి ఈ ఉద్యమం.

ఎంతో విజ్ఞత, వివేకం, అపార రాజకీయానుభవం కల్గిన పివి నరసింహారావు అయోధ్య విషయంలో బిజెపికి పూర్తి స్వేచ్ఛ ఇచ్చిన తన తొలి తప్పు కప్పి పెట్టుకోవడానికి అంతకంటే పెద్ద తప్పులు చేయడం దురదృష్టకరం. ఆయన ఇప్పటికైనా ఆత్మపరిశీలన చేసుకొని, పదవి కాపాడుకొనే ప్రయత్నంతో కాక, దేశ ప్రయోజనాలు పరిరక్షించే దృక్పథంతో సముచిత, సుదృఢ నిర్ణయాలు తీసుకోవాలి.

# జమీన్‌రైతు

18.9.42

10 పేజీలు అణా

## నెల్లూరు ముచ్చట్లు

విమర్శకుడు

### నామినేషన్లు

చుండూరు సుబ్బయ్య రావుసాహెబ్ గూడ మునిసిపల్ కేదారక్షేత్రాన్ని రెడ్‌క్రాస్ నాగలితో ఒకసాలు దున్ని నాలుగు గింజలు చల్లిచూచారు. అవేమీ మొలవలేదు. లక్ష్మయ్య అంటే రూకబలం, మూకబలం, కల్లవాడు. అదిగాక బ్యాంకు ప్రెసిడెంటు పోటీనుండి తప్పించవలసి వున్నది. అందువల్ల లక్ష్మయ్యకు చేసే కృషి ఫలిస్తుందని అంటున్నారు.

మునిసిపల్ సభ్యులు యెవరుగా వుంటారు అనేది వచ్చేమాటు ఊహాగానం చేద్దాం.

ఇక జిల్లాబోర్డు విషయాలు :- వెంకటగిరి విషయమేమీ మన ఊహకందడంలేదు. రాజాగారికిందులో ఏమీ దురదలేదు. రామన్నగిమన్నల శకం అంతరించింది. గోవిందయ్యలు విధిలేకుండా వార్ని బాధిస్తే తప్ప లేకుంటే ఈ విషయంలో వారేమి జోక్యం బుచ్చుకోరనే మనమనుకోవచ్చు.

హరిజనుల విషయం వూహ కందలేదు. మహమ్మదీయ స్థానం సలాం సాహెబ్, ఖాజీ, మహబూబ్ ఖాన్ గార్లలో వుంటుంది. క్రైస్తవ స్థానం బహుశా పున్నయ్యగారిని వూహించవచ్చు.

ప్రెసిడెంటు విషయం గోవిందరెడ్డి గారిదే. సందేహం లేదు. వైస్ ప్రెసిడెంటు విషయం ముందుగా నిర్ధారణ కాదు. కందుకూరుకు మాత్రం పోదు. ఏమంటే అది వరకొచ్చిన వించే వాలు తరతరాల వరకు గోయిందయ్యకు కావలి విషయం రెండూ బాప

### 50 ఏళ్ళ క్రితం ఈ వారం

మరదులకైనా అని అంటారని సందేహపడొచ్చు. నెల్లూరు అంటే చక్కెర రెడ్డా? బి.ఎ. రెడ్డా అని సందేహం? చక్కెర రెడ్డి తనదేనంటాడు గాని వారి జాతకరీత్యా చూస్తే లగ్నంలో కేతు వున్నాడు. కావున అది దుస్సాధ్యం. ఇక గూడూరు - దువ్వూరు నారాయణరెడ్డి గారికి యెక్కువ బలం వుంది. తాను వుండడు గాని శిష్యుడి కోసరం పట్టుబట్టవచ్చు. ఏమైనా ప్రెసిడెంటు ఎలెక్షనైన తర్వాత రామచంద్రారెడ్డి గారి బసలో గాని యిది తీర్మానం గాదు.

ఇక చిల్లర విషయాలు: బ్రాహ్మణవాసనంటే గిట్టదనే మాలకొండారెడ్డి, చిమటా శంకరయ్య విషయంలో మాత్రం అంగీకరిస్తారా? కనిగిరి బ్రాహ్మలే కాబోలు రెడ్డి గారికి వేరు?

దర్శికి ఒక రెడ్డి, ఒకరు యితర కులస్థులు వుంటారు, పొదిలి ఒక రెడ్డి - ఒక యితర కులస్థుడు వుంటాడు. కనిగిరికి ఒక రెడ్డి - ఒక బ్రాహ్మడు వుంటారు.

కందుకూరుకు ఒక రెడ్డి - ఒక నాయుడు వుంటారు. కావలికి యిద్దరు రెడ్లే వుంటారు, ఉదయగిరి ఒక రెడ్డి - ఒక నాయుడు వుంటారు, ఆత్మకూరు ఒక రెడ్డి, ఒక నాయుడు వుంటారు. కోవూరు యిద్దరు రెడ్లే, గూడూరు యిద్దరు రెడ్లే, రాపూరు ఒక రెడ్డి - ఒక శెట్టి వుంటారు. వెంకటగిరి - అయోమయంగా వుంది సూలూరుపేట ఒక రెడ్డి - ఒక శెట్టి వుంటారు.

ఇవి ఇప్పటికి స్థూలంగా మనబుద్ధి కందినవి. ఇవన్నీ వూహాపోహలే. లోపల లోటలోట ఎట్లున్నదో?

కొరవ 10 పేజీలో

# దీన్నొక పీడకలగా మరచి మళ్ళీ కలసి బ్రతుకుదాం!

హిందూమత సిద్ధాంతాలు చాలా గొప్పవి. మత ప్రవచనంలోని ధర్మంచర, సత్యంవద అనే నీతి వాక్యం ధర్మంగా నడచి సత్యం మాట్లాడమని చెబుతుంది. అంటే అహింసా పరమోధర్మః;సర్వేజనా సుఖినోభవంతు అనేకదా! హిందువనేవాడు ప్రతిరోజు ఉదయం, సాయంత్రం ఆచరించే సంధ్యావందనం, గాయత్రి మంత్రాలు కూడా మనిషిని మాయకు అతీతుడిని చేయమని ఉద్బోధిస్తున్నాయి. కాని ఎంతమంది విశ్వహిందూ పరిషత్ నాయకులు, భారతీయ సంస్కృతికి వారసులమని చెప్పే బి.జె.పి. వాళ్లు వీటిని పాటి స్తున్నార ు. అవిపాటి ంచ వీరెట్లా హిందువులవుతారు; సంస్కృతిని ఎలా సంస్కరిస్తారు. అధికార కాంక్షతో అత్యున్నత స్థానం కోసం ఆరాటం కాకపోతే మరేమిటి ఈ విధ్వంసం?సహ జీవన స్రవంతికి గొడ్డలి పెట్టుగా పరిణమించిన వీరిని దేశ సంక్షేమాన్ని కాంక్షించే హిందువులు ఈ సమాజం నుండి బహిష్కరిస్తే గాని బుద్ధిరాదు. ఈ పార్టీల వారిని దేశద్రోహుల కంటే పెద్దపదం ఏదైనా వుంటే దాని పేరున పిలవాలి. దేశంలోని ప్రజలంతా ఈ దుస్సంఘటనను ఒక పీడకలలా మరిచి మళ్లీ సహజీవన స్రవంతిలో కలవాలని మనసారా కోరుకుంటున్నాను.

-ఆవుల కొండయ్య

గూడూరు.

### ఇతరుల జోక్యం తగదు

భారత దేశాన్ని అట్టుడికించిన అయోధ్య సమస్య దేశ ప్రజల కుటుంబ సమస్యగాని ప్రపంచ సమస్యే ఏమాత్రంకాదు. పని గట్టుకొని రెండు దేశాలు చేస్తున్న దుష్ప్రచారాన్ని ఖండించాలి. ఆ దేశాల్లో ఎన్నో

## జనవాణి

సమస్యలున్నా వాటిని కప్పి పుచ్చేందుకు మతమౌఢ్యంతో పలువురి ఆకర్షించేందుకు అవిచేస్తున్న లోపాయికారి వ్యవహారమే ఇది. మత, కుల, వర్గ విబేధాలకు ఎదురొడ్డి మహా మనుషులు స్వర్గీయ గాంధీ, ఇందిరమ్మ, రాజీవ గాంధీలు ప్రాణాలు కోల్పోయి సమగ్రతా నినాదానికి వూపిరి పోశారు. ఆ మహనీయుల త్యాగాలు వృధా కాకూడదు. దేశ సమగ్రత కాంక్షించే ప్రతి ఒక్క భారతీయుడు ఈ ప్రచారాన్ని ఖండించాలి.

-ఎన్. శ్రీనివాసులు

జలదంకి.

### ఇది పైశాచిక చర్య

అయోధ్యలో బాబ్రీ మసీదును పడగొట్టడాన్ని పైశాచిక చర్యగా

కొరవ 11 పేజీలో

# మతసౌమనస్యానికి కవితా హారతి

## ఎందుకీ అయోధ్య

సి. నారాయణ రావు

అదొక దుస్వప్నం -
సమైక్యభారతం
గుండె చెరచి పోగా,
కరకు గట్టిన స్వార్థం
కొందరి దుస్సాహసం
ప్రవేశించి విధ్వంసం
క్షణక్షణం భయం భయం
మానవాళి కోల్పోయె విచక్షణం
అన్నాదమ్ముల అనుబంధనల్ని విడచి
దినహీన గాధల్ని మరచి
శ్రీరామ ! ఏమిటీ అటవికత?
అటవికులకైన పాశవికత,
మనిషి మనిషికీ మధ్య
పొసగని సయోధ్య
ఎందుకీ అయోధ్య
రాజకీయ లబ్ధికోసం
పార్టీలు సృష్టించే మిథ్య!

నేస్తమా
మానవత్వమే కావాలి అందరి మతం
కలిసి బ్రతకడమే మన అభిమతం
వేదనకు స్పందించే ప్రతివ్యక్తి రాముడే!
ఆవేదనను తీర్చే ప్రతి హృదయమూ
దేవాలయమే!

## మనందరిదీ ఒకే మతం!

జయంపు కృష్ణ

మనిషికి హితమైనది మతం
సర్వహితమైనది సమ్మతం
మనమధ్య మంట కలిపేది
మారణ హోమాన్ని సృష్టించేది
మతం చేత లౌకిక రాజ్యంలో
అజ్ఞానం పోసి, అమానుషం రగిలించేది
సమగ్రతను, సమైక్యతను భంగం చేసేది
మతమూ కాదు; అది మనకు
హితము కాదు
గతాన్ని తవ్వడము, మనోగతాన్ని
ధ్వంసం చేయడము, విరి చేయడము
సరి కాదు; సామరస్యం సాధించడానికి
సమతాభావానికి గురి కాదు-
మానవసేవే మాధవ సేవ
సర్వమతాల కితాబు అదే!
దానికి విఘాతం కలిగినా
విధ్వంసం జరిగినా
జన జాగృతిని దెబ్బతీస్తుంది
మనోనిబ్బరాన్ని ఛేదిస్తుంది-
విగ్రహం కాదు నిగ్రహం కావాలి
మసీదు - మందిర నిర్మాణం కాదు
మనసుల పునర్నిర్మాణం చేయాలి
విశాల దృక్పథం, విశ్వమత తత్వం
రెక్కలు విప్పాలి - స్వేచ్ఛగా ఎగరాలి
ముక్కలు కావడం మంచి మార్గంకాదు
ముప్పేటగా ఎదగడం జరగాలి -
మార్పంటే కూర్పుకాదు, కుదుపు కాదు
మంచి తీర్పు - మహోన్నతమైన నేర్పు
మూడు రంగుల జండా మనది
సర్వమతముల గుండె మనది
దానికి చిన్న గాయమయినా హేమము
మనోవ్యాధికి మందు లేదు ఖాయము -
సహజీవనము, సమరస భావము
అది నుంచి అవాజ్యమైన పునాది
అనేక తంత్రుల మిశ్రమ రాగం
ఈ పుణ్యభూమి నినదించేవేదం
ఏ తీగ తెగినా అంతటా అపస్వరం
ఎక్కడ శృతి తప్పినా అంతా
అవరోహణం
మహామేధావుల్లారా?
సామాన్య ప్రజల్ని ఒక్కసారి చూడండి
వారి కన్నీటి కథాలను అవలోకించండి
వారి ఆర్తిని మీరు ఆవహించండి
జాతి పునర్నిర్మాణానికి శ్రమించండి
దివ్య నవ్య భారతాన్ని నిర్మించండి
కలిసి మెలసి ముందుకు నడవండి
మనదంతా ఒకే జాతి - మానవ జాతి
మనదందరిదీ ఒకే మతం -
మానవత్వం
అనాడే మనదేశం - మహోన్నతం
అనాడే మనందరికి మహోదయం

## ఇదే నా నాదేశం?

రసిక్

'సర్వేజనాః సుఖినోభవంతు'
అని మనసారా కోరుకునేది
నాదేశమనుకున్నాను
'సర్వభూతములందు దాగియున్న
పరమాత్మకు సదా నమస్సులర్పిస్తూ
ఆ "భూత" అన్న పదంలో
ప్రతిచేప, పక్షి, జంతువూ,
మనుష్యప్రాణి
ఇమిడి వున్నాయన్న ఎరుక కలిగినది
నాదేశమనుకున్నాను-
ఆదిశంకరుని అద్వైత భావనను
ఆకళింపు చేసుకొని, అందరి
జీవాత్మలూ
దివ్యాత్మ స్వరూపాలే అని
తెలుసుకోగల్గినది
నా దేశమను కున్నాను-
నిజ సమాధి స్థితిలో మతప్రవక్తల
దివ్యదర్శనంతో పులకించి, తరించి
అన్ని మతాల గమ్యమొక్కటే అని
నొక్కిచెప్పిన
"పరమహంస"ను ప్రసవించగలిగిన
నాదేశమనుకున్నాను
విశాలమైనదే గాక, హృదయవైశాల్యం
కల్గి
సమున్నతమైన హిమాద్రి నీడలో
సమున్నతమైన సంస్కారం పండించు
కొన్నది
నాదేశమనుకున్నాను
ఇన్నాళ్ళకు తెలిసి వచ్చింది నాకు
నా స్వతంత్ర భారత దేశమెలాంటిదో-
ఇప్పుడు తెలిసింది నాకు
ఒకే ఒక్క అపవిత్ర, అనాగరిక,
అధార్మిక, అప్రజాస్వామిక
కుహనాభరిత కుచేష్టతో
వేలాది సంవత్సరాలనుండి కూడ
కట్టుకొని వస్తోన్న
విశిష్టసంస్కృతిని కోల్పోవడమేగాక
అధఃపాతాళానికి అమాంతంగా
అరక్షణంలో దూకేసిన
సిగ్గుతో అందరి తలలూ వంచేసిన
దేశం నాదేశమని!
గతాన్ని కలికి త్రవ్వితీసి దొరకిన
వజ్రాలను పారవేసి, బొగ్గుల
మసిపూసుకొని
'మర్యాదాపురుషోత్తముని'కన్నసీమలో
అమర్యాదకు పరాకాష్ఠగా నిలువదగిన
కృత్యానికి
పాల్పడిన దుస్సాహస దురంహంకార
హింసాత
జనారణ్యం నాదేశమని-
ఉన్నతోన్నత ధర్మాసనాన్ని ఒక
గడ్డిపోచగా
రాజ్యాంగాన్ని రాయిరప్పగా కాలదన్ని
పలుగూ పారలను న్యూక్లియర్
బాంబులుగా మార్చి
ఆత్మ వినాశనానికి పూనుకొని
అణగారి పోతున్న దేశం నాదేశమని-
ఆ ఈ ప్రార్థనా స్థలాలు రెండూ
ఒకదాని కొకటి సలాముచేయగల
ఒకదాని కొకటి వందనం చేయగల
అందమైన ఆరోజు అనతికాలం లోనే
అరుదెంచాలని
దిగజారిపోతున్న ఈ దేశం
పునరుద్ధరణ భాగ్యం పొందాలని
ఆ ఈశ్వరుణ్ణి, ఆ అల్లాను
ఆర్తితో వేడుకొంటూ
గొంతెత్తి ఘోషిద్దాం రండి!
వెక్కివెక్కి విలపిస్తాం రండి!

# కోళ్ళఫారంలో క్రీడా కాలేజి

## పాములు, తేళ్ళతో విద్యార్థుల నిత్య సర్కస్



నామంలా దరిశన్ లేదా అంటారు హిందీలో!

పేరుగొప్ప ఊరుదిబ్బ అన్నది తెలుగు సామెత. ఆ కాలేజి పేరు ఏ.సి.సుబ్బారెడ్డి కాలేజి ఆఫ్ ఫిజికల్ ఎడ్యుకేషన్! అయితే జనవ్యవహారంలో అది కోళ్ళ ఫారాల కాలేజి అయింది. కోళ్ళఫారాలలో వెలిసింది కాబట్టి దీనికాపేరు స్థిరపడిపోయింది. ఈ విదారి ... దీని శుభారంభం. పొదలకూరు ... వెంగళరావు నగర్ సెంటర్లో ఒక ... పాడేసిన కోళ్ళఫారాల కాంప్లెక్స్‌లో ఇది ... అన్ని ... నుండి ... మందికి పైగా విద్యార్థులు వచ్చి ఇక్కడ చేరారు. వాళ్ళు ... నాలుగు నెలలు అవుతోంది. ... పట్టుమని పదిక్లాసులు జరిగిన ... లేదు. అక్టోబర్‌లో దసరా ... నవంబర్లో వానాకాలం సెలవులు, ఇక డిసెంబరులో కర్ఫ్యూ మాతలు!

ఇక్కడ వుండడానికి ఓ ప్రిన్సిపాలు, ఫిజికల్ డైరెక్టర్ ఉన్నారు. క్లాసులు జరపడానికి బెంచీలు కాదుగదా కనీసం బ్లాకు బోర్డుకూడా లేదు! పుస్తకాలు, పాఠాలు ఎలా ఉంటాయోనని స్టూడెంట్లు మొగంవాచి ఎదురు చూస్తుంటారు. సిలబస్ మాత్రం నీట్‌గా ప్రింట్ చేసి చేతిలో పెట్టేశారు. గవర్నమెంట్ లెక్కల ప్రకారం ... స్టూడెంట్ నుండి ... మించి ఫీజు వసూలు చెయ్యకూడదు. కాని ఈ కాలేజి నిర్వాహకులు ఒక్కొక్కరి దగ్గర్నుండి ఏడెనిమిది వేలు ముక్కుపిండి వసూలుచేశారు. స్టూడెంట్లనుండి డబ్బు రాబట్టు దానికి ఎన్నిమార్గాలున్నాయో అన్నింటినీ యధాశక్తి ఉపయోగించు కుంటున్నారు. అందులో ఓ టెక్నిక్ - హాస్టల్ నిర్వహణ. రాష్ట్రంలో ఎక్కడా లేని విధంగా ఈ ఫిజికల్ ఎడ్యుకేషన్ కాలేజీని కంపల్సరీగా రెసిడెన్షియల్ చేసిపారేశారు. ప్రస్తుతానికి కాలేజి సమీపంలోనే ఒక బాడుగ ఇంట్లో హాస్టల్ వెలగ బెడుతున్నారు. త్వరలో దీన్ని కోళ్ళఫారాల్లోకి తరలించాలని ప్రయత్నం.

### సింహపురి

కోళ్ళఫారాలలో తేళ్ళు, పాములతో సహజీవనానికి స్టూడెంట్లు ప్రస్తుతం రిహార్సల్స్‌లో ఉన్నారు- హాస్టల్ ఛార్జీలు, మెస్ ఛార్జీల రూపంలో ధనం పంటను బాగా పండిస్తున్నారు. అయితే ఈ కాలేజికి ఏది ఉన్నా ఏదిలేకపోయినా నెల బాడుగకు తీసుకొన్న సువిశాలమైన ప్లేగ్రౌండ్ మాత్రం అదృష్టవశాత్తు ఉంది. కాలేజీ పిల్లలు పొద్దస్తమానం ఆ గ్రౌండులో ఆట్లాడుకొంటూ వుంటారు. అక్కడ బోర్ కొడితే ఏసిస్టేడియంకు వెళ్లమంటారు.

ఎరక్కపోయి ఈ కాలేజిలో ఇరుక్కపోయామని అరవై ఆరుమంది (అందులో ఇద్దరాడ పిల్లలున్నారు ఆరున్నొక్కరాగంలో శాపనార్థాలు పెడుతున్నారు. స్వర్గీయ ఏసిసుబ్బారెడ్డి పేరుకే గాక విద్యారంగంలో నెల్లూరుకున్న గొప్పకీర్తి ప్రతిష్ఠలకు కూడా పెద్ద మచ్చగా తయారైంది

ఫిజికల్ ఎడ్యుకేషన్ కాలేజి అంటే ఫిజికల్ డైరెక్టర్లను, గేమ్సుకోచ్‌లను తయారుచేసే ఉన్నత క్రీడా విద్యాసంస్థ. అటువంటి సంస్థను ఇంత చౌకబారుగా, ... కొట్టు వ్యాపారంగా నిర్వహిస్తున్న నిర్వాహకులనేమనాలి! ఏసి పేరుంది కాబట్టి, ఇదీ ఆనంవారి సంస్థానంలో ఒక భాగమనుకొనే ప్రమాదం వుంది. కాని వారికి దీనితో ఏ సంబంధమూ లేదు. నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఫర్ డెవలప్ మెంట్ స్టడీస్ అనే పొడుగు పేరు కల్గిన ఒక ప్రైవేటు వ్యాపార సంస్థ ఈ కాలేజి స్థాపకురాలు. దీని యజమాని శ్రీ సంజీవరావు ఇదికాక మరోక ఐదు జూనియర్ కాలేజిలకు ప్రభుత్వం లైసెన్సు ఇచ్చిందట. అందులో నాలుగింటిని- ముత్తుకూరు, గూడూరు, ఇందుకూరుపేట, తోటపల్లిగూడూరులలో ప్రారంభించారు. అవికూడా ఇంకే స్థాయిలో నడుస్తున్నాయో?

ఒక్క సంస్థ ఇన్ని కాలేజిలు నడపడానికి ప్రభుత్వం అనుమతి ఎట్లా ఇచ్చింది? కేవలం కాగితంపైన లైసెన్సు మంజూరు చేసి, చేతులు దులుపుకోవడమే ప్రభుత్వ విధానమా? ఆ కాలేజిలు ఎట్లా నడుస్తున్నాయి. వాటికి కవిన వసతులు

కొరవ 10 పేజీలో

తూపిలిపాళెంలోని మాగుంట అక్వాఫార్మ్స్‌లో తొలి హార్వెస్ట్ జరుగుతున్న దృశ్యం!

# జిల్లాలో అతిపెద్ద రొయ్యల పరిశ్రమ మాగుంట వారిదే!

నెల్లూరు జిల్లాలో రాకెట్ స్పీడుతో వస్తున్న అసంఖ్యాక రొయ్యల ప్రాజెక్టులలో మాగుంట సోదరుల ప్రాజెక్ట్ అతి పెద్దదిగా వుండబోయేట్లుంది. కోట దగ్గర, తూపిలిపాళెంలో వారు నెలకొల్పబోతున్న మాగుంట అక్వాఫార్మ్స్ పెట్టుబడి 63 కోట్లు. జిల్లాలో థాపర్స్, శరత్ సి ఫుడ్స్ కంపెనీలు 50 కోట్ల పెట్టుబడితో వస్తున్నాయి. తక్కినవన్నీ, వీటితో పోల్చితే, చిన్నవి క్రిందే లెక్క.

పైలట్ ప్రాజెక్టుగా నిర్మించిన ఫారమ్‌లో మొన్న 15 తేది తొలి హార్వెస్ట్ చేసిన సందర్భంగా, మాగుంట అక్వాఫార్మ్స్ ఎగ్జిక్యూటివ్ డైరక్టర్ శ్రీ పి. ప్రసన్నరెడ్డి ప్రెస్ కాన్ఫరెన్స్ పెట్టి వివరాలు చెప్పారు. ఈ ప్రాజెక్టు మొత్తం విస్తీర్ణం - 810 ఎకరాలు. దాదాపు 200 హెక్టార్ల విస్తీర్ణంలో రొయ్యల పాండ్లు కడతారు. దానికి అనుబంధంగా హేచరీ, ఫీడ్ ప్లాంట్, ప్రాసెసింగ్ ప్లాంట్, కోల్డ్ స్టోరేజి తదితర పరిశ్రమలన్నీ వస్తాయి. ఎంతలేదన్నా ఆరేడు వందల మందికి జీవనోపాధి లభిస్తుంది. ఇక్కడ పెంచే రొయ్యలను ఎగుమతి చేయడానికి అమెరికాలో వున్న అల్లూరీయుడు శ్రీ బి. వెంకురెడ్డితో ఒప్పందం కుదిరింది. ఆయన తన ఓరియెంటల్ ఫుడ్స్ ఇన్‌కార్పొరేటెడ్ కంపెనీ ద్వారా మొత్తం రొయ్యలు కొనుగోలు చేస్తారు.

**63 కోట్ల పెట్టుబడి, 600 మందికి ఉద్యోగాలు!**

తొలి హార్వెస్ట్‌లో హెక్టారుకు ఆరున్నర టన్నుల దిగుబడి సాధించారు. మొత్తం ప్రాజెక్టులో సరాసరి దిగుబడి 5 టన్నులు. థాయిలాండ్‌కు చెందిన ప్రఖ్యాత సిపి ఫుడ్స్ వీరికి సాంకేతిక సహాయం అందజేస్తున్నది.

హార్వెస్ట్‌కు అమెరికా అల్లూరీయుడు వెంకురెడ్డితో పాటు, శ్రీ మాగుంట సుబ్బరామిరెడ్డి, శ్రీ మాగుంట

కొరవ 8 పేజీలో

# పట్టపుపాళేలలో యుద్ధవాతావరణం

**తమవేలితో తమకన్నే పొడుచుకుంటున్నారు నెల్లూరు జాలర్లు**

తమిళనాడు, ఆంధ్ర జాలర్ల మధ్య చెలరేగిన వివాదం, ఘర్షణలు, నెల్లూరు జిల్లా తీర ప్రాంతంలో ఉద్రిక్త వాతావరణాన్ని ప్రేరేపిస్తున్నాయి. దాదాపు పది రోజుల నుంచి తడ నుంచి తెట్టు వరకు వున్న వేలాది మంది మత్స్యకారులు సముద్రంలో వేట మాని ఇళ్లలో కూర్చొని వున్నారు. సముద్రాన్ని యుద్ధ స్థలిగా మార్చి పోరాడడానికి సన్నద్ధులౌతున్నారు. తుఫాన్లు ఉపశమించి, సముద్రపు గాలులు చేపల వేటకు అనుకూలంగా మారినా వల విసరడానికి ఎవరూ సాహసించడం లేదు. ఒక్క కృష్ణపట్నం బేసిన్ లోనే దాదాపు వంద మర పడవలు లంగర్లు వేసుకొని సమస్య పరిష్కారమైందన్న వార్త కోసం ఎదురు చూస్తున్నాయంటే పరిస్థితి ఎంత ఉద్రిక్తంగా వుందో అర్థం చేసుకోవచ్చు.

అల్లూరు, విడవలూరు, ఇస్కపల్లి, పొన్నపూడి పట్టపుపాళెలలో సిపైరేట్లన దగిన సముద్రపు దొంగల బృందాలు తయారై వున్నాయని తమిళ జాలర్ల ఆరోపణ. ఇస్కపల్లి పట్టపుపాళెం జాలర్లు మొదటి నుంచి మిలిటెంట్లు. సముద్రపు చేపల వేట అనవాయితీ తప్పి, దరికి సమీపంలో వలవేసే మరబోట్లను పట్టి శిక్షించడం వారికి చాలా కాలం నుంచి అలవాటు. తెప్పల పైన గుంపులు గుంపులుగా పోయి, దరికి దగ్గరగా వుండే మరబోట్లను ముట్టడించి, లోపలున్న వారిని పట్టి బంధించి, పెద్ద రగడ అయిన తర్వాత వదలి పెట్టడం వారికి మామూలే. ఒక్కొక్కసారి పోలీసు జోక్యం చేసుకున్నా తామనుకున్నది నెరవేరే వరకు పట్టిన పట్టు విడవని మూర్ఖత్వం వారిలో పుష్కలంగా వుంది. ఒకటి రెండు సార్లిట్లా

కొరవ 7 పేజీలో

# అధికార్ల అసమర్థతే కావలి అధ్వాన్న స్థితికి కారణం!

గత రెండేళ్లుగా కమీషనర్ పాలనలో వున్న కావలి మునిసిపాలిటి అధికార్ల నిర్లక్ష్యం, వుదాసీనతల వల్ల అత్యంత అధ్వాన్న స్థితికి చేరుకొంది. ఏ వీధి చూసినా ఏమున్నది గర్వకారణమన్నట్లు మాసాల తరబడి ఊడ్చని రోడ్లు, ముక్కులు పగిలిపోయే దుర్వాసన వెదజల్లే కాల్వలు, పేరుక పోయిన చెత్త కుప్పలు సాక్షాత్కరిస్తాయి. రైల్వే లైన్ పడమర, రెవిన్యూ కాలనీలతో పాటు టౌన్‌లోని పలు వీధుల్లో పరిస్థితి మరీ అధ్వాన్నంగా తయారైంది. ఈ ప్రాంతాల్లో రోడ్లపై నడుంలోతు మురికి గుంటల్లో దోమల వుత్పత్తి కేంద్రాలు యధేచ్ఛగా నడుస్తున్నాయి. ఇక్కడ పందుల ఆనందాన్ని వర్ణించక్కర్లేదు. వీధులను నెలల తరబడి శుభ్రపరచక పోవడం వల్ల పలుచోట్ల పేరుకపోయిన చెత్త కుప్పలు దర్శనమిస్తాయి. వాటి నుండి వచ్చే దుర్గంధాన్ని జనం భరించలేక పోతున్నారు. వీధి దీపాలు వెల్గడం మాని ఎన్నో రోజులయ్యింది. టౌన్‌లోని దుస్థితి గురించి ఎవరైనా మునిసిపల్ అధికార్లను నిలదీస్తే నిధులు లేవనే సమాధానం

## జిల్లావార్తలు

ఇస్తారట. వాస్తవం విచారిస్తే పారిశుధ్య పనులు చేస్తున్న సిబ్బంది చేత పని చేయించను అధికార్లకు సత్తా లేక పోవడమే కారణమని తెలుస్తూంది. అదీ గాక ఆఫీసులోని ప్లానింగ్, రెవిన్యూ సెక్షన్లలో లంచగొండితనం రాజ్యమేలుతున్నదన్న ఆరోపణలు వినవస్తున్నాయి. ఏ చిన్నపాటి పనికైనా చేయి తడపనిదే పెన్ను కదలడం లేదట. శాసనసభ్యులు శ్రీ యానాదిరెడ్డి మూడవ కన్ను తెరవకుంటే లాభం లేదు.

### కావలిలో శాంతి యాత్ర

అయోధ్య సంఘటలను పురస్కరించుకొని కావలి టౌన్‌లో ఏర్పడిన ఉద్రిక్తతను రూపుమాపేందుకు 13 తేది ఎమ్మెల్యే శ్రీ కలికి యానాదిరెడ్డి ఆధ్వర్యంలో పెద్ద ఎత్తున శాంతి యాత్ర జరిగింది. ఉత్తరం వీధిలోని మశీదు వద్ద నుండి బయలుదేరి టౌన్ వీధులగుండా రెవిన్యూ డివిజన్ కార్యాలయం వద్దకు ప్రదర్శన జరిపారు. పట్టణ ప్రముఖులు, ఆర్డీవో శ్రీమతి వాణి శంకర్‌తో పాటు 2 వేల మంది ప్రజలు ఈ యాత్రలో

కొరవ 8 పేజీలో

# [illegible]
## [illegible]

### జనార్దనరెడ్డి

మాజీ ముఖ్యమంత్రి శ్రీఎన్. జనార్దనరెడ్డి 26 తేది నెల్లూరు వస్తున్నారు. 25 తేది రాత్రి హైదరాబాదులో బయల్దేరి మద్రాసు చేరుతారు. 26 ఉదయం 9గంటలకు కాళహస్తి దగ్గర వెలగలమంద రిజర్వాయర్ ప్రారంభోత్సవం; 10.30కి పెరిమిడిలో ప్రాజెక్ట్‌ఆయకట్టు రైతాంగంతో చర్చలు. మధ్యాహ్నం 12 గంటలకు వెంకటగిరి. 3 గంటల వరకు స్థానిక కార్యక్రమాలు. సాయంత్రం వెంకటగిరి పోలీసు బెటాలియన్ క్రీడోత్సవాలు. రాత్రికి వాకాడులో మకాం.

27 తేది ఉదయం 8.30కి నెల్లూరు; 9.30కి ఎస్టిటి హోం ప్రారంభోత్సవం; 10.30కి స్త్రీల క్రీడోత్సవాలు; 11 గంటలకు జిల్లా ప్రణాళికాబోర్డు సమావేశం; సాయంత్రం 4గంటలకు ఇందిరాభవన్‌లో కార్యకర్తల సమావేశం; రాత్రికి మళ్ళీ వాకాడులోనే విడిది. 27 తేది, తదుపరి కార్యక్రమాలు తర్వాత నిర్ణయమౌతాయి.

### నీళ్లమంత్రి

మైనర్ ఇరిగేషన్ మంత్రి శ్రీ పి. శంకరరావు 19 తేది ఉదయం నెల్లూరు వస్తున్నారు. ఉదయగిరిలో, మర్రిపాట్ల వాగు నిర్మాణం పనితీరును సందర్శించి రాత్రికి తిరిగి హైదరాబాదు వెళ్లిపోతారు.

### బిజెపి రాస్తారోకో- టౌన్‌లో ఉద్రిక్తత

అయోధ్య సంఘటనలు ప్రజలనెంత భయభ్రాంతులను చేసి వున్నాయో, 17 తేది ఉదయం అప్రకటితంగా నెల్లూరు టౌన్‌లో కొద్దిసేపుజరిగిన బంద్‌ను బట్టి తెలుసుకోవచ్చు. బిజెపి అధికారంలో వున్న రాష్ట్రాలలో ప్రభుత్వాల బర్తరఫ్‌కు నిరసనగా నెల్లూరులో 17తేదిఉదయం బిజెపి సభ్యులు రాస్తారోకో చేపట్టారు. ములుమూడి బస్టాండు, గాంధీ బొమ్మప్రదేశాలలో వారు ప్రధాని శ్రీ పివి నరసింహారావు దిష్టిబొమ్మలు తగులబెట్టారు. ఈ ప్రదర్శనలు టౌన్‌లో వున్నట్టుండి ఉద్రిక్త వాతావరణం సృష్టించాయి. బిజెపి సభ్యులు వీధుల్లోకి వచ్చారని తెలియగానే చిన్నబజారు, ట్రంకురోడ్డు వంటి ప్రాంతాలలో టపటప అంగళ్లు మూతపడ్డాయి. ఎక్కడివారక్కడ రోడ్లమీనుంచి అదృశ్యమైపోయారు. ఎందుకు అంగళ్లు మూతవేస్తున్నామో, అంగళ్లవారికే తెలియదు; తెలుసుకోవాలనే ప్రయత్నం కూడా చేయలేదు. ఈలోగా పోలీసులు ప్రదర్శకులను అరెస్ట్ చేయడంతో అందరికీ విషయం అర్థమై మళ్లీ అంగళ్లు తెరిచారు. ఈ గంట, గంటన్నరలోగా ఎంత భయోద్విగ్న వాతావరణం ఏర్పడిందో, ఎన్ని పుకార్లు షికారుచేశాయో చెప్పలేము.

పరిస్థితి చాలా సెన్సిటివ్‌గా వుంది. ఏ రాజకీయ పార్టీ అయినా తమ కార్యక్రమాలు చేపట్టినప్పుడు ప్రత్యేక జాగ్రత్తలు తీసుకొని, ప్రజలను ఇబ్బంది పెట్టకుండడం అవసరం. అసలు కొంత కాలం రాజకీయ పార్టీల కార్యకలాపాలన్నింటినీ నిషేధించినా మేలేనేమో!

### బెజవాడ రామచంద్రారెడ్డి మరణం

ఇందుకూరుపేట మండలం మాజీ అధ్యక్షుడు శ్రీ బెజవాడ రామచంద్రారెడ్డి 17తేది రాత్రి మరణించారు. ఆయన వయస్సు 56సంవత్సరాలు. రామచంద్రారెడ్డిగారు చాలా కాలంనుంచి క్యాన్సర్ వ్యాధితో బాధపడుతుండినారు. ఆస్పత్రులు చేయగల్గింది ఏమీ లేకపోవడంతో నెల్లూరులోని మాగోరి ఇంట్లో విశ్రాంతి తీసుకుంటుండినారు. 17తేది సాయంత్రం పరిస్థితి విషమించడంతో కుడితిపాళెంలోని స్వగృహానికి తీసుక వెళ్ళారు. ఆ రాత్రే ప్రాణం పోయింది.

బుచ్చిరెడ్డిపాళెం సంపన్న కుటుంబీకుడు. స్వాతంత్ర్య సమర యోధుడు, జైలు శిక్షకూడా అనుభవించిన స్వర్గీయ బెజవాడ వెంకటకృష్ణారెడ్డి పెద్దకుమారుడు శ్రీ రామచంద్రారెడ్డి. జిల్లాలో పేరెన్నికగన్న భూస్వామి స్వర్గీయ కూకటి కోదండరామరెడ్డి పెద్ద అల్లుడు; మాగోరికు బావమరిది, వియ్యంకుడు. రామచంద్రా రెడ్డిగారు మృదుస్వభావి. పెద్దభూస్వామే అయినప్పటికీ అతి సామాన్యంగా కన్పించేవాడు. తెల్లటి వస్త్రాలు. పెదవులపై చిరునవ్వుతో ఉల్లాసంగా కన్పించేవాడు. మండలాధ్యక్షత ఆయన తొలి రాజకీయ పదవి. ఎప్పుడూ రాజకీయాల జోలికి వెళ్ళేవాడుకాదు. వివాద రహితుడు.

రామచంద్రారెడ్డి గారికి ఇద్దరు కుమారులు, ఒక కుమార్తె. పెద్ద కుమారుడు వెంకట్రామరెడ్డి- గుండ్రా జనార్ధనరెడ్డి అల్లుడు; కుమార్తె మాగోరి ఇంటి కోడలు.

ఆయన కుటుంబానికి మా సానుభూతి తెలియజేస్తున్నాము.

### టిడిపి కార్యవర్గం

జిల్లా తెలుగు దేశం అధ్యక్షుడుగా శ్రీ సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి నియామకంతో పాటు కార్యవర్గాన్ని కూడా నియమించారు. ఉపాధ్యక్షుడుగా శ్రీ బెజవాడ ఓబులురెడ్డి, డాక్టర్ ప్రభాకరనాయుడు, వివి నరసింహప్రసాద్; కార్యదర్శిగా శ్రీ గొట్టిపాటి కొండపనాయుడు, ప్రచార కార్యదర్శిగా డాక్టర్ పెంచలయ్య, సంయుక్త కార్యదర్శులుగా పిటి రంగరాజన్, జి.మస్తానయ్య, పెళ్లకూరు ప్రభాకరరెడ్డి, ఆర్గనైజింగ్ కార్యదర్శులుగా శ్రీ కంభం విజయరామరెడ్డి, శ్రీవైటినాయుడు, కోశాధికారిగా శ్రీవేనాటి మునిరెడ్డి, కార్యవర్గ సభ్యులుగా శ్రీ యాచేంద్ర, రత్తయ్య, సంక్రాంతి కళ్యాణ్, కె. దశరథరామరెడ్డి, గోపాలకృష్ణచౌదరి, అల్లారెడ్డి కృష్ణారెడ్డి, మేడా అశోక్ కుమార్‌రెడ్డి, అహమ్మద్ భాషానియమితులైనారు. సీనియర్లైన దేగా, ఎల్లసిరి, వేటూరి బాబూరావు, ఎన్‌సి గౌరవ స్థానాలలంకరిస్తారు.

అత్రితోట అగ్రహారంలో జిల్లా కార్యాలయం కూడా ప్రారంభమైంది.

నెల్లూరు ఎం.జి. బ్రదర్స్‌లో బజాజ్ డీలర్ షిప్ ప్రారంభిస్తున్న మాగుంట సుబ్బరామరెడ్డి, జెకెరెడ్డి, ఆనం సంజీవరెడ్డి, సంస్థ యజమాని గంగాధరం.

### దోపిడిల దర్యాప్తుకు సిబిసిఐడి డిఐజి

జిల్లాలో విపరీతంగా జరుగుతున్న దోపిడీలు, బందిపోట్ల సంఘటనలపై దర్యాప్తు జరపడానికి రాష్ట్ర ప్రభుత్వం సిబిసిఐడి బృందాన్ని పంపింది. ఆ విభాగం డిఐజి శ్రీఎ ఎస్ రెడ్డి 13 తేది నెల్లూరు వచ్చారు. దోపిడీలు జరిగిన కోవూరు, పోతిరెడ్డిపాళెం, కొడవలూరు వంటి ప్రదేశాలు, ఇళ్లు సందర్శించారు. సంబంధిత ఫైళ్లు పరిశీలించారు.

వారం రోజులనుంచి జిల్లాలో దోపిడీలు పూర్తిగా తగ్గుముఖం పట్టివున్నాయి. చెప్పుకోదగ్గ చోరీ ఏదీ జరగలేదు. పోలీసులు మరింత అప్రమత్తంగా వుండవలసిన సమయ మిదే!

### ఆర్‌ఎస్‌ఎస్ అరెస్టులు

నెల్లూరులో ఆర్‌ఎస్‌ఎస్‌కు సంబంధించిన నలుగురు కార్యకర్తలను అరెస్ట్‌చేసి, ఆ తర్వాత విడుదల చేశారు. నిషేధిత సంస్థలకు సంబంధించి జిల్లాలో పెద్దగా చర్యలేవీలేవు. ఆర్‌ఎస్‌ఎస్ విహెచ్‌పి ఆఫీసులకు మాత్రం సీలువేశారు.

### ముస్లింకార్యాలయం సీలు

కోటమిట్టలోని జమాయితీ ఇస్లామిక్ కార్యాలయానికి 17తేది సీలు వేశారు. నెల్లూరు ఆర్‌డిఓ, ఎమ్మార్వోలు పోలీసుల సహాయంతో ఆఫీసును సోదాచేసి, కొన్ని అభ్యంతర కర పుస్తకాలు స్వాధీనం చేసుకొని, సీలు వేశారు.

### నెల్లూరు బజారు

| | | |
|---|---|---|
| మొలగొలుకులు | | |
| | 9672 | 3,500/- |
| | 9674 | 3,800/బండోను |
| ఐ.ఆర్. 20 | | 2,600/- |
| సున్నాలు | | 2,900/- |
| బియ్యం (70 కెజి) | | 550/- |
| బంగారుసవర (8గ్రా) | | 2,960/- |
| వెండి (10 గ్రా) | | 70/- |

### నీటిమట్టం

| | |
|---|---|
| కనిగిరి రిజర్వాయరు | 17.8 అ |
| సర్వేపల్లి చెరువు | 7.32 అ |
| నెల్లూరు బజారు | 15.2 అ |

జమీన్‌రైతు
సంవత్సరచందా రూ. 100/-
ఆరు నెలలకు రూ. 50/-
విడిప్రతి రూ. 2.00

# పినాకిని తీరం

## చంద్రమోహన్

జిల్లా తెలుగుదేశం అధ్యక్షుడుగా బ్లాకెలకు శ్రీ నోమిరెడ్డి చంద్రమోహన్ రెడ్డి నియమింపబడ్డారు. మా కాంగ్రెస్ వాళ్లవలె ముసలి ముతకను ఏరి నిర్ణయించకుండా, ఒక యువకుణ్ణి నియమించిన శ్రీ ఎన్.టి. రామారావు అభినందనీయుడు. ఆలస్య మైనా మంచి నిర్ణయం.

పార్టీలో అతిరథులు మహారథులు, యోధానుయోధులు, తలలు నెరసిన పెద్దలు, ధనపు సంచుల మీద ఆసీనులై వుండే కుబేరులు, అన్నదీయులు ఎందరో వుండగా, పై వాటిలో ఏ అర్హతా లేని ఈ బక్క మనిషి నియమింపబడడం ఆశ్చర్యకరమే. బహాశా ముఠాల పోటాపోటీల్లో, ఏ ఒక్కరూ మరొకరికి అంగీకార యోగ్యుడు కాని సందర్భంలో, ఎవ్వరికీ వ్యతిరేకత లేని అభ్యర్థిగా చంద్రమోహన్ ఒక్కడే అర్హుడుగా కనపడి వుండవచ్చు; ఒకసారి మేనమామ గారి దుష్పలహాతో తప్పు చేసినా, వెంటనే దాన్ని సవరించుకొని ఆనాటి నుండి పార్టీలో నిజాయితీగా వుంటూ, పోరాటపటిమ గలిగిన యువకుడుగా రుజువు చేసుకొని చంద్రమోహన్ జిల్లా పార్టీ నాయకత్వానికి తనను మించిన అభ్యర్థి లేడనిపించుకొని జిల్లా పదవిని పొంది వుండవచ్చు; మూడో కారణం జిల్లా పార్టీలో పలుకుబడి గలిగిన మాజీలు గిజీలందరూ చంద్రమోహన్ ధ్యర్థిత్వానికి తమ మొగ్గుచూపి వుండవచ్చు. ఏమైతేనేమి తగిన సమయంలో తగిన పదవిని పొందగలిగిన అదృష్టవంతుడు చంద్రమోహన్.

చంద్రమోహన్ మెరిక లాంటి యువకుడు; నరం వలె రాత్రింబవళ్లు శ్రమించి పనిచేసే వ్యక్తి. దీక్షాదక్షతలు, పట్టుదల పంతం ప్రతీకారేచ్ఛ పుష్కలంగా కలిగిన వాడు. వయసుకు మించిన రాజకీయ అనుభవం, మెళకువలు తెలిసిన అఖండుడు. ఆత్మవిశ్వాసం, ఆత్మ స్థైర్యం అపారంగా కలిగిన చాణక్యుడు. ఒక్కమాటలో చెప్పాలంటే పుట్టుకతోనే రాజకీయ వాది చంద్రమోహన్. పుట్టుకతో అంటే గుర్తుకు వచ్చింది. తండ్రి నుండి రాజకీయ వారసత్వం పొందిన వాడు చంద్రమోహన్. అయితే తండ్రి దురదృష్టవంతుడు, తనయుడు అదృష్టవంతుడు. తండ్రి నీతని, నిజాయితీ అని, స్వార్థరాహిత్యమనే ఛాందసపు విలువలకు కట్టుబడి, పార్టీ మారకుండా, ఆనం వారి విరంకుశత్వానికి స్వస్తి పలికించాలనే ఏకైక లక్ష్యంతో ఆర్థికంగా, శారీరకంగా తాను కరిగిపోయిన యోధుడు. జిల్లాలోనే కాక, రాష్ట్ర పరిధిలో కూడా కాంగ్రెస్ ముఖ్యుల ఆదరాభిమానాలుండినా, పదవులు మురాలు లేకుండా శ్రీనివాస మహల్ రాజయ్య అనే పాపులారిటీలోనే కన్ను మూసిన వ్యక్తి. తండ్రి రాజగోపాలరెడ్డి ఎన్నుకున్న 'నెగటివ్' మార్గం ప్రయోజన రహితమని గ్రహించిన తనయుడు చంద్రమోహన్ 'పాజిటివ్' పథాన్ని ఎన్నుకొని అనతికాలంలోనే సద్యః ఫలితాలను పొందుతూ ముందుకు మున్ముందుకు దూసుకపోతూ అనుభవ వివేకి అనిపించుకుంటున్న వాడు. మొత్తానికి తండ్రిని మించిన కొడుకు చంద్రమోహన్.

పదవి లభించింది, మంచి భవిష్యత్తు వుంటుంది — చంద్రమోహన్ వాటిని కాపాడుకో గలగాలి! రాజకీయంలో బంధుత్వాలకు, వ్యక్తిగత అనుబంధాలకు స్థానం లేదు. ఆ బలహీనతలకు లోనైతే, లోపాయి కారీ రాజకీయాలకు అలవాటు పడితే వున్నతి కుంటుబడడమే కాదు, ప్రతిష్ట కూడా దెబ్బతింటుంది. మేనమామల రాజకీయ భ్రష్టత్వం అల్లుడికి వంట బట్టకూడదని నా ఆకాంక్ష.

## వెంకట నరసారెడ్డి

స్వాతంత్ర్యయోధుడు, జీవి తాంతం ఖద్దరుదారి, కాంగ్రెస్ వాది, ఐశ్వర్యవంతుడైనా ఆడంబరం ఎరుగని గంభీర స్వభావుడు ఏనుగ వెంకట నరసారెడ్డి గారి శతజయంతిని ఈ రోజు (18 తేది) జరుపుకొంటున్నారు ఆయన కుమారులు కుమార్తె. అన్న వస్త్రదానాలతో కూడిన ఈ కార్యక్రమం ఆయన స్వగ్రామమైన పల్లాపల్లెలో జరుపు తున్నారు గాని, దేశభక్తుడుగా, సత్యాగ్రహిగా, పైగా భాగ్యశీలిగా బాగా ఎదిగిన గూడూరులో జరిపివుంటే బాగుండేదేమో!

వెంకట నరసారెడ్డి గారు వ్యష్టి సత్యాగ్రహం చేసినపుడు నేను మూడవ ఫారం చదువుతుండిన పిల్లవెధవని. అయినా కాని క్లాసుకు (ఫెంచ్ లీవు పెట్టి సత్యాగ్రహం వద్ద, గెల్లిటీ కోర్టు వద్ద తప్పకుండా హాజరు వేసుకుంటుండే వాణ్ణి. వీధి పేరు మరచి పోయాను గాని, పోలయ్య నాయుడు భవనం వున్న వీధిలో, ఒక గుడి వేదిక మీద వెంకట నరసారెడ్డి గారి సత్యాగ్రహం. స్థానిక కాంగ్రెస్ నాయకులు, ప్రజలు ఎక్కువ సంఖ్యలోనే హాజరై వుండినారు. ఆ సత్యాగ్రహ వేదిక మీద ఆకస్మాత్తుగా ఒక ఆగంతకుడు ప్రత్యక్షమయ్యాడు— ఆయన ఎవరో కాదు, గూడూరు సబ్ కలెక్టరు, సత్యాగ్రహాలకు సంబంధించి విచిత్రమైన తన తీర్పుల ద్వారా రాష్ట్ర ఖ్యాతి పొందిన గెల్లిటీ దొర! కాంగ్రెస్ నాయకుల వుపన్యాసాలటుంచి, గెల్లిటీ దొర తెలుగులో తన వుపన్యాసాన్ని లంఘించుకున్నాడు. సారాంశం ఏముంది? సత్యాగ్రహం పరమ దండగ అనేదే! అదొక సంచలనాత్మక సంఘటన. సందర్భం. కాంగ్రెస్ సత్యాగ్రహ వేదిక మీదకు బ్రిటీష్ ప్రభుత్వం వున్నతాధికారి, అందులో తెల్లదొర రావడం, వుపన్యసించడం దేశంలో మరెక్కడా జరగలేదు.

సత్యాగ్రహం చేసిన వెంకట నరసారెడ్డి గారిని కోర్టుకు హాజరు పరుచగా గెల్లిటీ దొర ఆయన్ను పిచ్చి పిచ్చి ప్రశ్నలతో గంటల పర్యంతరం వేధించారు. వెంకట నరసారెడ్డి గారిది శాంత స్వభావం. ఎంత కవ్వించినా తమికే వాడు కాదు. దొర ప్రశ్నలన్నిటికీ వెంకట నరసారెడ్డి ఓపిగ్గా సమాధానాలు చెప్తూనే వున్నారు. గూడూరుకు 20 మైళ్ల దూరంలో ఒక హరిజన హాస్టల్ వుందా? అని గెల్లిటీ ప్రశ్నించారు. తెలుసు, వాకాడులో వుంది అని వెంకట నరసారెడ్డి గారి సమాధానం. దానికి విరాళమేమైనా ఇచ్చారా? గెల్లిటీ నుండి మరో ప్రశ్న. 'ఎంత?' నూట పదహారు రూపాయలు. ఆయన మూడో ప్రశ్న; ఈయన సమాధానం. నూట పదహారు రూపాయలా అంటూ హేళనా స్వరంతో గెల్లిటీ వెంకట నరసారెడ్డిని ఎత్తిపొడిచినట్లు వ్యాఖ్యానించాడు. దానికి వెంకటనరసారెడ్డి గారు తొణక లేదు. ఇంతకూ గెల్లిటీ ఆయనకు శిక్ష వేయకుండా పంపివేశారు. గెల్లిటీ కోర్టులో జరిగిన ఇటువంటి దృశ్యాలెన్నో నా కళ్లెదుట ప్రత్యక్షమవుతుంటాయి.

శిక్ష విధింపబడని సత్యాగ్రహులు యుద్ధానికి సహాయం చేయవద్దని ప్రచారం చేసుకుంటూ పాదయాత్ర సాగించాలి. వెంకట నరసారెడ్డి గారు పట్టుదల గల మనిషి. మరి కొందరు సత్యాగ్రహ వాసులతో కలసి ఆయన పాదయాత్ర చేస్తూ, మధ్యలో అరెస్టుగావింపబడి, శిక్ష అనుభవించారు. వెంకట నరసారెడ్డి గారిని అప్పుడు దూరం నుండి చూచాను; జమీన్‌రైతులో చేరిన తర్వాత అనేక సార్లు కలుసుకొని, మాట్లాడే వాణ్ణి.

NVR

## మాగుంట

(5 పేజీ కొరవ)

శ్రీనివాసులు రెడ్డి కూడా హాజరైనారు. సముద్రపు ఇసుక తిన్నెల మీద కమ్మటి విందు చేశారు. విందులో రొయ్యలు మాత్రం తెప్పించలేదు — దొరలు ఏ వాటిని మనం తింటే ఎట్లా అనుకున్నారేమో!

ఈ ప్రాజెక్ట్ నిర్మాణం పూర్తయితే తూపిలిపాళెం పరిసర గ్రామాలకు అభివృద్ధి వరం సంప్రాప్తిస్తుంది. కంపెనీ తరఫున ఆయా గ్రామాల అవసరాలు తీర్చడానికి పథకాలు వేస్తున్నారు. ఆ గ్రామాల్లో నిరుద్యోగ సమస్య వెతికినా కన్పించదు. రోడ్లు, కరెంట్ వంటి వాటికి కొరత వుండదు. మాగుంట సోదరుల స్పీడ్ చూస్తే — ఏడాది తిరిగే సరికే రెడీ అయి పోయేట్లుంది ప్రాజెక్ట్!

# శివారెడ్డి పద్యాలు

### దేవళాలు గుళ్ళు గోపురాలు

దేవళాలుగుళ్ళుదేవుళ్లపేరెత్తి
యిష్టపడవునీవు ఎందువలన
ఏటికొచ్చినాక ఏడైన యింతేలె
కుర్రకారు ప్రతిది క్రొత్తమీకు!

దేవళాలకేగ్తె దేవుళ్లదర్శిస్తె
పైన ఖర్చుదీన ఫలితముండు
పొట్టనిండబోదు పులిహోరదద్దోజ
నమ్మదప్పు కవికి నచ్చదేది!

### అయోధ్య

ఆదరాక బొయ్యి అయోధ్యదర్శించి
రావాలంటె లేదు రైలుదార్థి
మధ్యదార్లో యారు మటుమాయమై పోతె
ఎవరు దిక్కు మొక్కు విజీబారు!

### పొట్టిశ్రీరాములు వర్థంతి

భట్టుకవిని నేను పొట్టిశ్రీరాముల్ని
కలుసుకోని ఎంతోకాలమైంది
మధ్యలోనె వారు మటుమాయమయ్యారు!
పాతన్యూసు దీంతొ పన్లయింక

### నెల్లూరు

నెల్లూరు! నీరుమనుగడే
పల్లుబులియువింటెకవికిపలురకములుగా
అల్లరిరచ్చలు లేవుగ!
చల్లగ వర్థిల్లువేయి సంవత్సరముల్.

## జాలర్లు

5 పేజీ కొరవ

వీరు ఈ కిడ్నాపింగ్ కార్యక్రమంలో విజయులు కావడంతో ఇతర పట్టపు పాళెలలోనూ అది వ్యాపించింది. తమిళనాడు నుంచి వేటాడుకుంటూ వచ్చే బోట్లను అక్కడక్కడా అటకాయించి దోచుకోవడం అలవాటై పోయింది. విసిగి పోయిన తమిళ జాలర్లు ఇటీవల సముద్రంలో లంగరు వేసి వుండిన ఒక సోనా బోటును ముంచి వేశారు. దీనికి ప్రతీకారంగా మన జాలర్లు తమిళనాడుకు చెందిన 20 మందిని పట్టి, బంధించారు. దానితో ఉద్రిక్తత పెరిగిపోయింది. సముద్రానికి పోతే ఏమి జరుగుతుందోనని భయపడి పోతున్నారు. ఎక్కడి పడవలక్కడ బంద్ అయిపోయాయి. పది రోజుల నుంచి ఇదే పరిస్థితి. ఇప్పుడు ఇరు వర్గాల మధ్య రాజీ ప్రయత్నాలు జరుగుతున్నాయి. మద్రాసు, కాకినాడల నుంచి బోటు యజమానులు వచ్చి వున్నారు. ముంచి వేసిన సోనా బోటుకు తగిన పరిహారం కట్టి, సమస్యను తాత్కాలికంగా పరిష్కరించేందుకు యత్నిస్తున్నారు.


జమీన్‌రైతు
సంవత్సరచందా రూ. 100/-
ఆరు నెలలకు రూ. 50/-

### ఆత్మకూరు డి.ము. కోర్టులో

OS 35/90

సిండికేట్ బ్యాంక్ - వాది

Vs

1. కలువాయి వెంకట కృష్ణారెడ్డి వగైరా - ప్రతివాదులు

To

1. కలువాయి వెంకట కృష్ణారెడ్డి, S/o. వెంకట రెడ్డి,
2. బైరవరపు వెంకట కృష్ణారెడ్డి S/o. వెంకట సుబ్బారెడ్డి

మినగల్లు గ్రామం, అనంతసాగరం మం.

పై నెంబరున వాది తనకు రావలసిన బాకీని రాబట్టుట కొరకు మీ పైన దావా వేసినందున మీకు నోటీసు నిమిత్తము 18.1.93 తేదికి వాయిదా వేయబడి వున్నది. కనుక మీరు ఆ రోజు పగలు 10.30నిమిషములకు పై కోర్టులో హాజరై మీకు గల ఆక్షేపణలను తెలుపుకొన వలసినది లేని యెడల మీ పరోక్షమున ఎక్స్‌పార్టీగా తీర్మానించ బడును.

**యస్. మహదేవ రెడ్డి**
వాది తరపు అడ్వొకెటు

### ఆక్షేపణ నోటీసు

నెల్లూరు మోటారుయాక్సిడెంట్స్ క్లెయిమ్స్ / ట్రిబ్యునల్ జిల్లా జడ్జి), వారి కోర్టులో

I.A. No. 61/91 :: O.P. No. /91

అరవ ధనలక్ష్మి వగైరాలు - పిటీషనర్లు

Vs

ఎమ్. సుందర రామిరెడ్డి వగైరాలు - రెస్పాండెంట్లు

To,R1, శ్రీ ఎమ్. సుందర రామిరెడ్డి, S/o. రాధాకృష్ణారెడ్డి

TSA 7767 వ్యాన్ ఓనరు, శాంతి నగర్, నెల్లూరు అనువారికి. పిటీషనర్లు పై నెంబర్న O.P.ని దాఖలు చేయుటలో జరిగిన ఆలశ్యమును క్షమించమని కోరి పై పిటీషను పెట్టి నందున మీరు 29.12.92 తేదిన పదయం 10 గం॥ కు పై కోర్టులో హాజరై, మీకు గల ఆ[illegible]లు తెల్పుకోని యెడల, మీ పరోక్షమున తీర్మానించబడును.

**డి. హనుమంతరావు,**
పిటీషనర్లు తర్పు అడ్వొకెటు

## జిల్లావార్తలు

(2 పేజీ కొరవ)

పాల్గొన్నారు. ఆర్డీవో కార్యాలయంలో జరిగిన సభలో పర్వమత సమైక్యతను పలువురు వక్తలు నొక్కి చెప్పారు.

### అల్లూరులో మిత్రపక్షాల ధర్నా

కర్ఫ్యూ పేరుతో అప్పటి జిల్లా తెలుగుదేశం పార్టీ ప్రచార కార్యదర్శి సోమిరెడ్డి చంద్రమోహన్ రెడ్డి, మరో ఇద్దరు విలేఖర్లపై జరిగిన దాడికి నిరసనగా 16 తేది అల్లూరు పోలీస్ స్టేషన్ ఎదుట మిత్ర పక్షాలు ధర్నా నిర్వహించాయి. పోలీస్ వైఖరిని నిరసిస్తూ నినాదాలు చేస్తూ గంటసేపు ధర్నా నిర్వహించిన పార్టీల కార్యకర్తలు ఎస్.ఐ.కి వినతి పత్రం సమర్పించి వూరేగింపుగా ఎమ్మార్వో కార్యాలయానికి వెళ్లి, అక్కడా కొద్ది సేపు ధర్నా చేసి వినతి పత్రం సమర్పించారు. 300 మంది మిత్ర పక్షాల కార్యకర్తలు పాల్గొన్న ఈ కార్యక్రమానికి అల్లూరు సర్పంచ్, తెలుగుదేశం పార్టీ జిల్లా కార్యవర్గసభ్యుడు మేడా అశోక్ కుమార్ రెడ్డి, సి.పి.ఎం. ఆర్గనైజింగ్ కార్యదర్శి కె. రమణయ్య నాయకత్వం వహించారు.

### నిమ్మరైతుల ఆవేదన

భారతదేశంలో నిమ్మమార్కెట్ అగ్రభాగాన వున్న గూడూరు డివిజన్‌లో తాము ఎన్నో సమస్యలు ఎదుర్కొంటున్నామని రైతులు వాపోతున్నారు. తమకు ప్రభుత్వం నుండి వ్యాపారపరంగా, సాంకేతిక పరంగా ఎటువంటి సహాయం అందడం లేదంటున్నారు. తరచూ సంభవించే ప్రకృతి వైపరీత్యాలు, రవాణా లోటుపాట్లు కృంగదీస్తున్నాయట. ఈ ఆటుపోట్ల నుండి గట్టెక్కను సమస్యల సాధనకు ఇటీవలే రైతులంతా కలసి ఒక సంఘాన్ని ఏర్పాటు చేసుకొన్నామని శ్రీ యు. రాధాకృష్ణయ్య చెబుతున్నారు.

### ఎన్.బి.కె.ఆర్. కాలేజి విద్యార్థిని ప్రతిభ

వెంకటేశ్వర విశ్వవిద్యాలయం పరిధిలో కడప జిల్లా ప్రొద్దుటూరులో జరిగిన ఇంటర్ కళాశాలల స్త్రీల క్రీడల అథ్లెటిక్ పోటీల్లో విద్యానగర్ ఎన్‌బికెఆర్ కళాశాల విద్యార్థిని ఎం. అమ్మాజీ అసమాన ప్రతిభ చూపింది. బి.ఏ మొదటి సంవత్సరం చదివే ఈమె 400 x 200 x 100 మీటర్ల పరుగు పందాలలో ప్రథమ స్థానంలో నిలచింది. లాంగ్ జంప్‌లో కూడా వ్యక్తిగత ఛాంపియన్ షిప్‌ను పొందింది. మధ్యప్రదేశ్‌లోని ధార్వాడ్‌లో జరిగే ఇంటర్ విశ్వవిద్యాలయం స్త్రీల అథ్లెటిక్ పోటీలలో పాల్గొనేందుకు ఎస్.వి. యూనివర్సిటి నుండి అమ్మాజీ ఎంపికయ్యింది. ఈ విద్యార్థిని ప్రతిభ వెలికి తీసేందుకు కళాశాల ఫిజికల్ ఎడ్యుకేషన్ లెక్చరర్ కెప్టెన్ ఆర్. వెంకటేశ్వర్లు ఎంతో కృషి చేశారు.

### డక్కిలిలో నాటు సారా

డక్కిలి మండలంలోని పలు గ్రామాల్లో నాటు సారా వ్యాపారం యథేచ్ఛగా సాగుతూంది. దొంగ సారా వ్యాపారుల నుండి రోజు వారీ మామూళ్లు అందుతుండడం వల్ల ఎక్సైజ్ అధికారులు పట్టీపట్టనట్లు వ్యవహరిస్తున్నారు. దానికి తోడు ఎక్సైజ్ అధికారులే ప్రభుత్వం నిర్ణయించిన ధర కంటె 50 పైసలు అదనంగా డీలర్లకు సరఫరా చేస్తుంటే; వారు మరో 50 పైసలు కమీషన్ వేసుకోవడంతో ఐదు రూపాయల పాకెట్ ధర ఆరు రూపాయలయ్యింది. లైసెన్సు వున్న వ్యాపారులు ప్రభుత్వ సారాతో పాటు వెలిగొండ అడవుల్లో తయారవుతున్న నాటుసారానూ భయంలేకుండా అమ్ముతున్నారు. వీటికి తోడు పాకెట్ల పై మర్రిచెట్టు, ఏనుగు, రాకెట్ మార్కులు గల సారా పాకెట్‌లు ఒక రూపాయి తెల్లై అయిదు పైసలకు అమ్ముతుండడంతో మండలంలో సారా వాడకం అధికమయ్యింది. కాపు సారా అమ్మే వారెవరైనా వుండాలేగాని కాచే వారు అర్థ రాత్రి పూట పైసా అడ్వాన్స్ తీసుకోకుండా వ్యాన్‌లలో తెచ్చిన క్యాన్‌లు దించి పోతుండడంతో పలువురు ఈ తప్పుడు మార్గాన నడిచేందుకు సిద్ధమవుతున్నారు. ఎక్సైజ్ అధికార్లు ఈ నాటుసారాపై దృష్టి కేంద్రీకరించక పోతే పొరపాటున ఏదైనా ఉపద్రవం సంభవిస్తే వందలాది మంది ప్రజలు ప్రాణాలు కోల్పోవడం తథ్యం.

### కేంద్రమంత్రి చింతామోహన్ పర్యటన

కేంద్ర రసాయనాలు, ఎరువుల శాఖసహాయ మంత్రి శ్రీ చింతామోహన్ 14 తేది తన పార్లమెంటరీ నియోజక వర్గ పరిధిలోని దొరవారి సత్రం మండలం ఏకొల్లు గ్రామంతో పాటు సూళ్లూరుపేటలో, వివిధ అభివృద్ధి కార్యక్రమాల్లో పాల్గొన్నారు. మంత్రి మదరాసు నుండి మధ్యాహ్నం తడకు చేరుకోగా అక్కడ పలువురు కాంగ్రెస్ నాయకులు ఘన స్వాగతం పలికారు. అనంతరం సూళ్లూరుపేట సరికొత్త తపాలా భవనాన్ని ప్రారంభించారు. రాత్రి ఏకొల్లు గ్రామంలో ఏర్పాటైన కార్యక్రమంలో పాల్గొని 120 మంది బలహీన వర్గాల ప్రజలకు ఇండ్ల స్థలాలు పంపిణీ చేశారు. 1989 లో ఈ గ్రామాన్ని సందర్శించినపుడు ఇళ్ల స్థలాలు, భూమి పట్టాలు, పక్కా గృహాలు ఇవ్వమని ప్రజలు కోరారని, ఇప్పటికి వారి కోర్కె నెరవేరిందని మంత్రి చెప్పారు. పట్టాలిచ్చిన స్థలాల్లో ఇండ్ల నిర్మాణానికి 8 వేల రూపాయల మొత్తం కూడా విడుదల చేసినట్లు చెప్పారు. గ్రామ ప్రజలు ఎదుర్కొంటున్న నీటి సమస్య పరిష్కార విషయమై కలెక్టర్‌కు సమగ్ర నివేదిక అందచేయవలసినదిగా ఎమార్వోను కోరారు. మంత్రి స్వయంగా ప్రజల సరసన కూర్చొని వారి సమస్యలు అడిగి తెలుసుకొన్నారు. జిల్లా కలెక్టర్ శ్రీ సాంబశివరావు, గూడూరు సబ్‌కలెక్టర్ సునీల్ శర్మ, జిల్లా గ్రంథాలయ సంస్థ ఛైర్మన్ బి. వేణుగోపాల రెడ్డి, నాయుడు పేట మాజీ మండలాధ్యక్షుడు చదలవాడ కృష్ణమూర్తి ఈ కార్యక్రమంపాల్గొన్నారు. ఏకొల్లుగ్రామంలోటికార్యక్రమంలోముగిసే సరికి రాత్రి అవడం వల్ల మంత్రి తన పర్యటన కుదించుకొని వెంకటగిరికి వెళ్లనట్లు తెలిసింది.

### అర్జున్‌సింగ్

( మొదటి పేజీ కొరవ)

సంఘటనను ప్రస్తావించాలని బిజెపి మినహా మిగతా ప్రతిపక్ష పార్టీలు ప్రయత్నించగా అయోధ్య విషయాన్ని లేవనెత్తకుండా అసెంబ్లీని వందే మాతరం 'గీతంతో మొదలెట్టాలని బిజెపి సభ్యులు పట్టుబట్టడంతో గందరగోళ మేర్పడింది. మసీదు కూల్చినందుకు నిరసనగా మజ్లిస్ సభ్యులు నల్లజెండాలతో నిరసన తెలియజేయగా బిజెపి సభ్యులు కాషాయ కండువాలను గాల్లోకి ఊపి గొడవ చేశారు. రాష్ట్రంలో అత్యవసర సమస్యల్ని చర్చించేందుకు ముఖ్యమైన బిల్లుల్ని ఆమోదించేందుకు ఏర్పాటైన సమావేశాల్లో మొదటి రోజు ఏ చర్చా లేకుండా ముగిసింది. తొలిరోజు సమావేశం వాయిదా పడ్డాక లాబీల్లో ప్రతిపక్షనాయకులు ఒకరిపై మరొకరు ఆరోపణలు చేస్తూ పత్రికలకెక్కారు. మాజీ ముఖ్యమంత్రి శ్రీ నేదురుమల్లి జనార్ధన రెడ్డి తొలిరోజు సమావేశానికి హాజరయ్యారు. అసెంబ్లీకి చేరిన వెంటనే ఆయన ముఖ్యమంత్రి ఛాంబర్‌కు వెళ్లి 'కోట్ల'తో కొద్దిసేపు ముచ్చటించారు. ఆ తర్వాత అసెంబ్లీ లాబీలోకి వెళ్ళి ఎమ్మెల్యేలతో, మంత్రులతో, పత్రికా విలేకరులతో సరదాగా గడిపారు. సుమారు 30 మంది ఎమ్మెల్యేలు, 8 మంది మంత్రులు జనార్ధన రెడ్డితో లాబీలో కులాసాగా కబుర్లు చెప్పుకున్నారు. నల్లపరెడ్డి శ్రీనివాసులు రెడ్డి మాత్రం విలేఖరుల సమావేశం పెట్టి సభ వాయిదాకు కారణమైన బిజెపిని దుయ్యబట్టారు. ఎప్ శ్రీ సి.వి. శేషారెడ్డి ఉదయం నుంచే వి.ఐ.పి.లను రిసీవ్ చేసుకునే కార్యక్రమంలో నిమగ్నమై కన్పిస్తున్నారు. కోట్లకు, జనార్ధన రెడ్డికి గులాబీ పూలతో స్వాగతం పలకడం సి.వి. వంతు అయింది.

### రోశయ్యకు పదవి రామిరెడ్డి అలక

ముఖ్యమంత్రి శాసనసభ్యుడు కాకపోవటంతో రాష్ట్ర శాసన సభాపక్షం నాయకుడిగా కొణిజేటి రోశయ్యను ముఖ్యమంత్రి నామినేట్ చేశారు. అయితే కోట్ల ఇంటి మని సీనియారిటీలో రోశయ్యకు కాస్త అటూఇటూగా వున్న తనకే శాసనసభాపక్షం నాయకుడి పదవి దక్కుతుందని రెవిన్యూ మంత్రి రామిరెడ్డి ఆశించారు. తనకు దక్కాల్సిన పదవి రోశయ్య తన్నుక పోవడంతో రామిరెడ్డి ముఖ్యమంత్రి పై అలుక వహించినట్లు తెలుస్తోంది. శాసనసభలో తిమ్మిని బమ్మిని చేయగలిగే సత్తా వుండటమే గాక, సీనియర్ అయినందుకే రోశయ్యకు నాయకత్వం అప్పచెప్పినట్లు ముఖ్యమంత్రి చెబుతున్నారు.

కాంగ్రెస్ లెజిస్లేచర్ పార్టీలో పెద్ద పీట వేయడం ద్వారా ముఖ్యమంత్రి అసెంబ్లీలో అసమ్మతీయుల నోటికి తాళం వేయగలిగారు. మంత్రి మండలి ఏర్పాటులో అడ్రస్ లేకుండా పోయిన అనేక మంది అసమ్మతీయులను లెజిస్లేచర్ పార్టీలో పదవులు ఇచ్చి కోట్ల తన రాజకీయ చతురతను చాటుకున్నారు. కేవలం జనార్ధన రెడ్డి మద్దతుదారులను మాత్రమే ముఖ్యమంత్రి చేరదీస్తున్నారన్న విమర్శల నేపథ్యంలో లెజిస్లేచర్ పార్టీ కార్యవర్గ నియామకాలు అసమ్మతీయుల్లో కొత్త ఆశలను చిగురింపజేశాయి. ఇంతకాలం ఏక పక్షంగా వ్యవహరిస్తున్న కోట్ల ఇప్పుడు అందర్నీ కలుపుక పోయేందుకు వీలుగా అసమ్మతీయులకు అందలం ఎక్కించారని ముఖ్యమంత్రి సన్నిహిత వర్గాలంటున్నాయి. మారిన ముఖ్యమంత్రి ధోరణిని బట్టి చూస్తే త్వరలో జరిగే మంత్రిమండలి విస్తరణలో అసమ్మతీయులకు మంత్రి పదవులు దక్కడం ఖాయం అనిపిస్తోంది. మాజీ ముఖ్యమంత్రిని తీవ్రంగా వ్యతిరేకించిన ఎమ్మెల్యేలు కోదండరామిరెడ్డి, వేదవ్యాస్‌లను లెజిస్లేచర్ పార్టీ కార్యదర్శులుగా నియమించారు. అలాగే కరారి ఈశ్వర్ కుమార్, గుర్రం శేషు, గల్లా అరుణ, డాక్టర్ శివరామకృష్ణరావు, మర్రి శశిధర్ రెడ్డి, టి. జీవన్ రెడ్డి, లక్ష్మిదేవి, షబ్బీర్ అలీ, సుభాష్ చంద్రబోస్ వంటి కరుడు గట్టిన అసమ్మతీయులను ముఖ్యమంత్రి లెజిస్లేచర్ పార్టీ కార్యవర్గ సభ్యులుగా నియమించారు. వీరంతా డాక్టర్ వై. ఎస్. రాజశేఖర రెడ్డి వర్గీయులు కావడం గమనార్హం. జనార్ధన రెడ్డికి సంబంధించినంత వరకు కేవలం సి.వి. శేషారెడ్డికి మాత్రమే కార్యవర్గ సభ్యుడిగా పదవి లభించింది.

## పంచాంగము

**శూన్యమాసము**

24తేది గురువారము నుండి శూన్యమాసము

### డిసెంబరు తిథులు

మార్గశిర బహుళ

తే 19శని దశమి ఉ.గ.10-02వ.

తే 20ఆది ఏకాదశి ఉ.గ. 8-20వ.

తే 21సోమ ద్వాదశి ఉ.గ.6-50వ.

తరువాత పూర్తిగ త్రయోదశి

తే 22మంగళ చతుర్దశి రా.గ.5.20 వ.

తే 23బుధ అమావాస్య రా.గ.5.15వ.

పుష్య శుద్ధ

తే 24గురు పాడ్యమి పూర్తిగ

తే 25విదియ పూర్తిగ

**స్వయంపాకుల శ్రీనివాసులు**
ఎం.ఏ.,

## అన్నగారి వేషాలెన్నో!

"మేజర్ చంద్రకాంత్" చిత్రంలో ఎన్టీఆర్ ఒక పాటలో అల్లూరి సీతారామరాజు, ఛత్రపతి శివాజీ, వీర పాండ్య కట్టబ్రహ్మన్న, సుభాష్ చంద్రబోస్ వంటి చరిత్ర ప్రసిద్ధి పొందిన మహనీయుల గెటప్స్‌లో ఆయన అభిమానుల్ని రంజింపచేయబోతున్నారట. ఈ చిత్రంలో శివాజీ గణేశన్ నటించిన "తంగపతకం" తమిళ చిత్ర ఛాయలు కొన్ని ఉన్నాయని హైదరాబాద్ చిత్ర పరిశ్రమలో గుసగుసలు వినిపిస్తున్నాయి. తమాషా ఏమిటంటే ఆ తమిళ చిత్రం తెలుగులో డబ్ కాగా, అదే ఇతివృత్తంతో మరో తెలుగు చిత్రం ఆ తర్వాత పునర్నిర్మింపబడింది కూడా!

### తమాషా టైటిల్స్

నరేష్, ఆమని నాయకానాయికలుగా రేలంగి నరసింహారావు దర్శకత్వంలో తయారయ్యే చిత్రం "ఇదండీ మావారి వరస". లలితశ్రీ కంబైన్స్ చిత్రం 'ప్రేమకు ప్రేమంటే తెలుసా?' పి.ఎన్. రామచంద్రరావు దర్శకత్వంలో నరేష్, సౌందర్య నటిస్తున్న చిత్రం 'అసలే పెళ్ళయిన వాణ్ని' శారద, వాణిశ్రీ, శోభన్ బాబులతో ఇ.వి.వి. సత్యనారాయణ దర్శకత్వం వహించే చిత్రం 'ఏమండీ, ఆవిడ వచ్చింది' లక్ష్మీ ఫిలిమ్ క్రియేషన్స్ చిత్రం 'మా నాన్న బ్రహ్మచారి'.

## పోలీసుగా జయసుధ

ఖాకీ యూనిఫారమ్ ధరించి నటించాలన్న జయసుధ చిరకాలవాంఛ త్వరలో నెరవేరబోతుంది. బాలాజీ మూవీ క్రియేషన్స్ "ఇన్స్‌పెక్టర్ ఝాన్సీ" లో ఆమె ప్రధాన పాత్రధారిణి. రంగనాథ్, హరీష్, సౌందర్య, గిరిబాబు, తనికెళ్ల భరణి, బాలాజీ, నర్రా, అల్లు రామలింగయ్య, నిర్మల, బాబూమోహన్, కోవై సరళ, పరమాత్మ సోదరులు నటిస్తున్నారు. దర్శకత్వం, సదాశివరావు. సొంత చిత్రం 'వింతకోడళ్లు' ఫ్లాప్ అయినందు వల్ల జయసుధ తన బాకీలు తీర్చడానికి ఓ మలయాళ చిత్రంలో కూడా నటించడానికి అంగీకరించింది.

## హీరోలపై ట్యాక్స్ దాడి!

హీరో చిరంజీవి, నిర్మాత అల్లు అరవింద్, డైరెక్టర్ కె. రాఘవేంద్ర రావు, హీరో వెంకటేష్, నిర్మాత డి. రామానాయుడు, హీరో మోహన్‌బాబు, నిర్మాత కె. దేవీవరప్రసాద్‌ల గృహాలు, కార్యాలయాల పై ఆదాయపు పన్ను శాఖవారు మద్రాసు, హైదరాబాద్, విజయవాడ, బెంగుళూరులలో పెద్ద ఎత్తున చాలా చెపు దాడులు నిర్వహించారు. వారి బంధువుల ఇళ్లల్లో కూడా అదే సమయంలో నల్ల ధనానికై సోదా చేశారు. ఎవరెవరి దగ్గర ఎంతెంత దొరికిందో మనకు తెలియదు.



రేపటికొడిలో లక్ష్మి, రఘు

## శపథం హుష్‌కాకి!

మోహన్‌బాబు నిర్మించే చిత్రాలకు ఆయన గురువు దాసరి నారాయణ రావుచే తొలిక్లాప్ కొట్టించడమో, కెమెరా స్విచ్ ఆన్ చేయించడమో మామూలు. ఐతే, ఎన్.టి. రామారావుతో మోహన్‌బాబు నిర్మిస్తున్న "మేజర్ చంద్రకాంత్" చిత్రానికి దాసరి చేత ఇదివరకటి లాగా శ్రీకారం చుట్టించక కేవలం అతిథుల్లో ఒకరిగా పిలిచినందుకు దాసరి నొచ్చుకుంటూ తాను ఇటు పైన ఏ సినిమా ఉత్సవాలలోనూ పాల్గొనబోయేది లేదని ప్రకటించారు. "శివరంజని" వంటి వార పత్రికల్లో ఆ విషయం అచ్చయింది కూడా. కాని, వారం రోజులు తిరక్కుండానే ఆయన ప్రత్యూష ప్రొడక్షన్స్ వారి చిత్రానికి తొలి క్లాప్ కొట్టడం చాలా మందిని చకితుల్ని చేసింది. "ఇది ఆయనకు మామూలే కదా?" అని నవ్వుకున్నారు ఆయన్ని ఎరిగిన వారందరూ. ప్రత్యూష ప్రొడక్షన్స్ తొలి చిత్రంలో అక్కినేని నాగేశ్వర రావు, వాణి విశ్వనాథ్, వినోద్ కుమార్, కస్తూరి, కోట శ్రీనివాస రావు, బాబూమోహన్, కాస్ట్యూమ్స్ కృష్ణ, శ్రీహరి, వై. విజయ వగైరా నటవర్గం, దర్శకత్వం: కోడి రామకృష్ణ.

### అసలే పెళ్ళయిన వాడ్ని

నెల్లూరీయుడు పి.ఎన్. రామచంద్ర రావు దర్శకత్వం వహిస్తున్న పై చిత్రంలో నరేష్, సౌందర్య, గిరిబాబు, వేలు, రాళ్ళపల్లి, మల్లికార్జున రావు, అనంత్, నర్రా, అశోక్ కుమార్, నాగేంద్ర ప్రసాద్ ఒక విశిష్టమైన పాత్రలో సత్యనారాయణ నటిస్తున్నారు.

## కెమెరామెన్ సన్యాసం!

186 చిత్రాలకు ఛాయాగ్రాహకుడుగా పనిచేసిన కలి సితార మేనమామ విపిన్‌దాస్ త్వరలో సన్యాసం స్వీకరించబోతున్నారు. బాల్యంలో తండ్రిని కోల్పోయాను. ఆకలితో అలమటించాను, ముష్టెత్తాను. ఎలాగైనా గుర్తింపు పొందాలనే తపన నాకు బాల్యం నుంచి ఉండేది. బొంబాయికి వెళ్లి ఫొటోగ్రఫీ నేర్చుకున్నాను. అత్యాశ, ఈర్ష్య, ద్వేషాలతో ఉండే మనుషులను చూశాక నాకు జీవితం మీద విరక్తి ఏర్పడింది. భగవంతుని పాద పద్మాలకు అంకితమవ్వాలనుకున్నాను. నా భార్య అంబిక, కొడుకు సత్యరాజ్, కూతురు కృప జీవనోపాధికి మార్గం కల్పించాను. ఇక నేనీ ప్రపంచంతో అన్ని బాంధవ్యాలు తెంచుకున్నాను అన్నారు విపిన్‌దాస్.

### మరో నిర్మాతల మండలి

చలన చిత్ర నిర్మాతల మండలిలో ఎక్కువగా భారీ చిత్ర నిర్మాతలకే ప్రాధాన్యత వుంటుంది. వినోద పన్నుల రాయితీలు ఎక్కువ ప్రయోజనకరంగా వున్నాయి. పన్నుల దుర్వినియోగం వల్ల ప్రభుత్వానికి ఏటా 20 కోట్ల రూపాయల నష్టం వాటిల్లుతోందన్న విషయం చలన చిత్ర పండితులకు తెలియనిది కాదు. ఇలా దుర్వినియోగం కాకుండా చిన్న చిత్రాలకు మేలు కలిగించేందుకు కొత్తగా ఏర్పడిన "మెడికల్ చిత్ర నిర్మాతల మండలి" కృషి చేస్తోంది. ఈ మండలికి నటుడు డాక్టర్ ప్రభాకర్ రెడ్డి అధ్యక్షుడు.

[illegible]

# అలెగ్జాండర్

నేటి సమాజంలో మితిమీరిన అవినీతి, దిగజారిన రాజకీయ విలువలవల్ల సామాన్యుడు పెక్కు సమస్యలు ఎదుర్కొని వాటిని పరిష్కరించుకోలేక పోతున్నాడు. సమస్యల సుడిగుండంలో విసిగి వేసారిన వాడు ఈ గతి తప్పిన సామ్రాజ్యాన్ని కూకటి వేళ్లతో సహా పెకలించను చీకటి సామ్రాజ్యపు 'అలెగ్జాండర్' కావాలంటాడు దర్శకుడు కె. రంగారావు. మళ్ళీ చిత్రం చివరన నీతి చెప్పాలంటూ నానా తప్పుడు పనులు చేసిన హీరోను న్యాయస్థానంలో నిలబెట్టి నీతిని నిలబెట్టేందుకే ఆ పనులు చేశానని చెప్పించి, నిర్దోషిగా విడుదలవడం చూపించి ప్రేక్షకులను విస్తుపోయేలా చేశాడు. తన కథకు తానే స్క్రీన్‌ప్లే రాసుకున్న దర్శకుడు, సన్నివేశాలను సాగదీశాడు. హీరోయిన్, హీరో ముద్దుకోసం పరితపించే సన్నివేశం అయితే పలు పర్యాయాలు చూపాడు. కథకు తగ్గట్టు కథనాన్ని వేగంగా నడపక ప్రేక్షకుల సహనాన్ని పరీక్షించాడు. దాన్ని అధిగమించను హీరోయిన్ నానపాటలు, వెకిలిచేష్టలు జత కలిపాడు. హీరోతో తన పాత్రకు పవర్‌ఫుల్‌గా చేయించను విఫలమైన దర్శకుడు విలన్ పాత్రను మాత్రం 'సెబాష్' అనిపించేలా చేయించాడు. కళాదర్శకుడు, ఎడిటర్, సంగీత దర్శకుల వద్ద నుండి మాత్రం మంచి పనిని రాబట్టుకొన్నాడు.

కథలోకి వస్తే జర్నలిస్ట్ రాజశేఖరం (బాలయ్య) కుమారుడు ప్రశాంత్‌కుమార్(సుమన్) వున్నత చదువులు చదివి, ఉద్యోగం



చిత్రసమీక్ష

అల్లూరు రహీం

రాకపోయేసరికి, ఆటోరిక్షా నడుపుకుంటూ హాయిగా జీవనం కొనసాగిస్తుంటాడు. మాఫియా అండర్ గ్రౌండ్ కింగ్ రాచకొండ లచ్చన్న (కోటశ్రీనివాసరావు) చేసిన దుర్మార్గపు పనుల గూర్చి రాజశేఖరం ఒక పరిశోధనాత్మక వ్యాసం తయారు చేస్తాడు. లచ్చన్న నడివీధిలో చేయించిన హత్యకు సాక్ష్యం చెప్పను సిద్ధమయ్యే సరికి రాజశేఖరం ఇంటిపై దొమ్మిగావచ్చి అతన్ని నిలువునా నరికేసి ఆ వ్యాసాన్ని పట్టుకెళతారు. పోలీసులు ప్రశాంత్ ఫిర్యాదును పట్టించుకోరు వున్నతాధికారులు, చివరికి హోంమంత్రికి ఫిర్యాదు చేసినా లచ్చన్నకు వారితో వున్న సంబంధాల వల్ల ఏమాత్రం సహాయం చేయక అవమానిస్తారు. ఆవేశం పట్టలేని ప్రశాంత్ లచ్చన్నను ఎదిరించను వెళ్ళి భంగ పడతాడు. ఆ సమయంలో లచ్చన్నవల్ల దెబ్బతిన్న మరో మాఫియా కింగ్ చక్రధరరావు(నూతన్‌ప్రసాద్) ప్రశాంత్‌ను చేరదీసి, అతడిని చీకటి సామ్రాజ్యపు 'అలెగ్జాండర్'ని చేస్తాడు. అప్పటినుంచి అలెగ్జాండర్ ఎత్తులను పైఎత్తులువేసిలచ్చన్న సామ్రాజ్యాన్ని ఎత్తులకు పై ఎత్తులు వేసి కూలదోస్తాడు. అవినీతిపరుల ఆటకట్టించనే తాను అలెగ్జాండర్ అవతారం ఎత్తవలసి వచ్చిందని న్యాయస్థానంలో చెప్పి, దోషులకు శిక్షపడేటట్లు చేసి తాను నిర్దోషిగా విడుదలవుతాడు.

సమాజంలోని నిరుద్యోగం, లంచగొండితనం, నైతిక విలువలు దిగజారిన నాయకులను చూపిన దర్శకుడు, వీటిని రూపుమాపేందుకు నేటి యువతరం 'అలెగ్జాండర్లు'గా మారాలని ప్రబోధించిన నీతే అగౌరవించినట్లుంది. ఇప్పటికే పలు రుగ్మతలతో అల్లాడుతున్న దేశంలోని యువతను ఇటువంటి చిత్రాలు ఆలోచనవైపుకు తీసుకపోక ఉద్రేకాలు పెంచి భ్రష్టుపట్టిస్తాయి.

కొత్త మాటల రచయితలు తన్నేటి, ఎం.ఎస్.నారాయణ మాటలు

కొరవ 10 పేజిలో

## సింహపురి

(4 పేజీ తరువాయి)

సమితిలాగానా, లేదా అన్ని విషయాలు పట్టించుకోవలసినంటలేదా? అటు స్థలం లేకుండా, శ్రీనవలో నైపుణ్యం గల్గిన టీచలు లేకుండా, కోర్సులు లేకుండా కనీసం క్లాసురూములు, పాఠ్యపుస్తకాలు, ఆట పరికరాలు లేకుండా విద్యార్థులకు ఏమి ఫిజికల్ ఎడ్యుకేషన బోధిస్తారు? అటువంటి కాలేజిల నుండి డిగ్రీలు పొందే ఫిజికల్ ట్రైనర్లు పిల్లలకు ఏమి ఆటలు నేర్పిస్తారు? సంబంధిత అధికారులెవరో గాని, వారు ఈ కాలేజిని ఒకసారి సందర్శించి, కనీసవసతుల కల్పనకు యాజమాన్యంపై వత్తిడి తేకుంటే విద్యార్థులు అన్యాయమైపోతారు.

### మద్రాసు అపోలో హస్పిటల్‌కు 25 వేల జరిమానా

ప్రాణాలు నిలబెట్టవలసిన డాక్టర్లు నిర్లక్ష్యంతో వ్యవహరించి, ఒక నిండు ప్రాణాన్ని బలిగొన్నందుకు మద్రాస్ అపోలో ఆస్పత్రి ఛైర్మన్‌కు 25వేల రూపాయల జరిమానా విధిస్తూ నెల్లూరు జిల్లా వినియోగ దార్ల ఫోరం 15 తేది తీర్పు చెప్పింది. వి.ఆర్. కాలేజి లెక్చరర్ శ్రీ బి. ప్రకాశరావు కుమార్తె లక్ష్మి వసంతకు 1990 జూన్ 5తేది జ్వరం వచ్చింది. దీనితో ఆమెను డాక్టర్ సి.ఆర్.రెడ్డి ఆస్పత్రిలో చేర్పించారు. కిడ్నీలోపం ఏర్పడినట్లు భావించిన ఆ డాక్టర్ లక్ష్మివసంతను మద్రాస్ అపోలో ఆసుపత్రిలో చేర్పమని వుత్తరం రాసి పంపారు. ఆమెను 'ఇన్‌టెన్సివ్‌కేర్' యూనిట్‌లో చేర్పుకున్న అపోలో డాక్టర్లు ఎటువంటి చికిత్సా చేయక పరీక్షలంటూ కాలం గడిపారు. ప్రకాశరావు డబ్బుకోసం నెల్లూరు వచ్చి, డబ్బుతీసుకొని తిరిగి మద్రాస్ వెళ్లేసరికి ఆమె చనిపోయింది. ఆమె మృతదేహాన్ని ఇచ్చేందుకు మూడు వేలు కట్టమని డిమాండ్ చేశారు. గత్యంతరం లేక వెయ్యిరూపాయలు చెల్లించారు. అదీగాక శవాన్ని తీసుకొచ్చినందుకు వ్యానుఛార్జి క్రింద మరో వెయ్యి కూడా కట్టారు.

డబ్బుతో పాటు అత్యంత ఆప్యాయత పెంచుకొన్న తన కుమార్తెకు సరైన చికిత్స లభించక మరణించడం పట్ల ప్రకాశరావు నెల్లూరులోని సి.ఆర్.రెడ్డి, మద్రాస్ అపోలో నిర్లక్ష్య చికిత్సలవల్ల తన కూతురు మరణించిందని నెల్లూరు ఫోరంలో ఫిర్యాదు చేస్తూ 98 వేలరూపాయల పరిహారాన్ని కోరారు. రెండు సంవత్సరాల పాటు సుదీర్ఘ విచారణ జరిపిన ఫోరం వాద, ప్రతివాదనలు, పూర్తి సాక్ష్యాధారాలు క్షుణ్ణంగా పరిశీలించింది. మద్రాసు అపోలో డాక్టర్లు సకాలంలో సరైన చికిత్స చేయడంలో విఫలమయ్యారని భావిస్తూ 'డెఫిసియన్సీ ఇన్ సర్వీస్' క్రింద 20 వేలు, ఫిర్యాది దారుల మానసిక క్షోభకు మరో 5వేలు రెండు నెలలలోగా చెల్లించాలని తీర్పుచెప్పారు. నెల్లూరు డాక్టర్ సి.ఆర్.రెడ్డి నిర్లక్ష్యంగా వ్యవహరించినట్లు ఫిర్యాది దారులు నిరూపించలేక పోయారని ఫోరం పేర్కొన్నది.

### నకిలీ సంస్థ బెయిల్ రద్దు

తప్పుడు జామీను దార్లులను కోర్టుముందు హాజరు పరచి, కోర్టును తప్పుత్రోవ పట్టించిన 10 మంది నిందితులకు బెయిల్ రద్దుచేస్తూ అదనపు జిల్లా జడ్జి ఎన్. సూర్యనారాయణ గారు బుధవారం ఉత్తర్వులు జారీ చేశారు. టౌన్‌లోని లక్ష్మీపురంలో రాయల్ కమర్షియల్ ఏజెన్సీ పేరుతో తక్కువధరలకు వస్తువులు అంద జేస్తామంటూ ఒక సంస్థ వెలిసింది. రాష్ట్రంలో పలు బోగస్ సంస్థలు ఏర్పడి ప్రజలను చీట్‌చేస్తున్న దృష్ట్యా ప్రజలు నష్టపోకుండా సి.బి.సి.ఐ.డి అధికారులు దాడిచేసి దాన్ని మూయించారు. సంస్థకు చెందిన కె.ఎన్.రాయప్పన్ మరో 9మంది పైన చీటింగ్ కేసులు నమోదుచేసి రెండో అదనపు న్యాయమూర్తి ముందు హాజరు పరిచారు. పూచీకత్తుపై బెయిల్ మంజూరు చేసిన న్యాయమూర్తి, జామీన్ దారుల ఆస్తిత్వాన్ని, మంచివారా నకిలీవారా విచారించమని ఆదేశించారు. అధికార్ల దర్యాప్తులో జామీను సర్టిఫికెట్లు అసలువైనా, జామీను హాజరైన వ్యక్తులు నకిలీలని తెలడంతో, నిందితుల తరఫున వాదించిన న్యాయవాదిని వారిని వెంటనే కోర్టుముందు హాజరు పర్చమని న్యాయమూర్తి కోరారు. వారికిచ్చిన బెయిల్ రద్దుచేశారు. సి.బి.సి.ఐ.డి అధికారులు వీరిని ఈ తీర్పుకు ముందే అదుపులోకి తీసుకున్నట్లు తెలిసింది.

### మసీదును పునర్నిర్మించాలి.

లౌకిక రాజ్యంలో మత ప్రసక్తిలేని రాజకీయ పార్టీలు వుండాలని, మతంతో ముడిపడిన పార్టీల వల్లే నేడు అయోధ్యలో బాబ్రీ మసీదు కూల్చివేత వంటి దుశ్చర్యలు జరుగుతున్నాయని జిల్లా కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ ఆనం సంజీవ రెడ్డి అన్నారు. 12 తేది టౌన్‌లో భారీ ఎత్తున జరిగిన మతసామరస్య యాత్ర అనంతరం గాంధీ బొమ్మ వద్ద ఏర్పాటైన సభలో ఆయన ప్రసంగించారు. ముస్లిం సోదరుల మనస్సుల్లో ఏర్పడిన గాయాన్ని మాన్పేందుకు కేంద్ర ప్రభుత్వం వెంటనే మసీదును పునర్నిర్మించాలని కోరారు. ఎమ్మెల్యే జె.కె. రెడ్డి మాట్లాడుతూ అయోధ్య పరిణామాల వల్ల ప్రపంచ దృష్టంతా భారతదేశం పై వుందని, గతంలో అన్ని దేశాలకు మార్గదర్శకత్వం వహించిన భారతదేశ ప్రజాస్వామ్యాన్ని నేడు వివిధ దేశాలు వేలెత్తి చూపుతున్నాయని, అందువల్ల ప్రతిపక్ష పార్టీలన్నీ మత సామరస్యం కోసం పాటుపడి దేశాన్ని కాపాడాలన్నారు. మత సామరస్య ప్రదర్శనలు, సభలు ప్రతి గ్రామాన జరిపి ప్రజలు శాంతియుత సహ జీవనం చేసేందుకు చేయూతగానిలవాలని సి.పి.ఎం. జిల్లా కార్యదర్శి శ్రీ జక్కా వెంకయ్య కోరారు. సి.పి.ఐ. జిల్లా కార్యదర్శి వేదాచలం కులమత సమైక్యతను నొక్కి చెప్పారు.

### శాంతియాత్ర

12 తేది శనివారం ఉదయం బి.జె.పి. మినహా ఇతర రాజకీయ పక్షాలు వాటి అనుబంధ సంస్థలు టౌన్‌లో మత సామరస్యం కోరుతూ శాంతి యాత్ర జరిపాయి. గాంధీ బొమ్మ నుండి బయలుదేరిన ప్రదర్శన ట్రంకురోడ్డు, సంతపేట, చిన్నబజారు, జెండావీధి, కోటమిట్ట, ధైకస్ రోడ్డు, పెద్ద బజారు, బారకాసు మీదుగా గాంధీబొమ్మకు తిరిగి చేరింది. ఈ శాంతి యాత్రలో నెల్లూరు ఎమ్పీ కుమారి కె. పద్మశ్రీ, ఎమ్మెల్యేలు శ్రీ జె.కె. రెడ్డి, శ్రీ సి.వి. శేషారెడ్డి, శ్రీ పత్రా ప్రకాశరావు, డి.సి.సి. అధ్యక్షుడు ఆనం సంజీవ రెడ్డి, మాజీ ఎమ్పీ మహమ్మద్‌షేక్ గౌస్‌మొహియుద్దీన్, ఆనం వివేకానంద రెడ్డి, మాజీ ఎమ్మెల్యే కె.వి. సుబ్బారెడ్డి, హాజీ హైదర్ ఇతర యూత్ కాంగ్రెస్ నాయకులు, తెలుగుదేశానికి చెందిన డేగా నారసింహారెడ్డి, టి. రమేష్ రెడ్డి, సి.పి.ఎం. జిల్లా కార్యదర్శి జక్కా వెంకయ్య, నారు కృష్ణయ్య, సి.పి.ఐ. పార్టీకి చెందిన వేదాచలం, రామచంద్రయ్య, జనతాదళ్ ఇస్మాయిల్, ఆచార్య పి.సి. రెడ్డి, డాక్టర్ మధుసూదన రావు పలువురు మాజీ మునిసిపల్ కౌన్సిలర్లు పాల్గొన్నారు.

### అపోలోలో అరుదైన ఆపరేషన్

నెల్లూరు అపోలో ఆసుపత్రిలో గతవారం కేన్సర్ సంబంధమైన ఒక అరుదైన అపూర్వ ఆపరేషన్‌ను డాక్టర్లు విజయవంతంగా నిర్వహించారు. అన్న నాళానికి కేన్సర్ వ్యాధి సోకడం వల్ల తీవ్ర ఇబ్బందులు పడుతున్న కడపకు చెందిన 39 ఏళ్ల రాఘవేంద్ర కుమార్ అనే వ్యక్తికి ఈ ఆపరేషన్ చేశారు. 7 గంటల పాటు నలుగురు డాక్టర్లు చేసిన ఈ ఆపరేషన్ ఆంధ్రప్రదేశ్‌లో ఇప్పటి వరకు ఏ వైద్య సంస్థా చేయలేదని సర్జన్ డాక్టర్ డి. శ్రీధర్ రెడ్డి చెప్పారు. ఈ రోగి వ్యాధి నయం చేసేందుకు స్వరపేటికను తీసివేసి, అన్ననాళంతో పాటు పొట్టను వాలుక పైకి శరీర అంతరంగాల నుంచి తెచ్చి కుట్టి విజయవంతంగా శస్త్ర చికిత్స ముగించారట. ప్రస్తుతం గాలి పీల్చను గొంతు వద్ద ఒక రంధ్రం ఏర్పచి, దుమ్ము ధూళి పోకుండా పలుచని కాటన్ పెట్టారు. రెండు చోట్ల భారీ శస్త్ర చికిత్స జరిగినా ప్రస్తుతం ఉల్లాసంగా వున్న రోగిని డాక్టర్లు విలేఖరులకు చూపారు. ఇంతకు ముందు ఆ రోగి నీళ్లు తాగను కూడా వీలు లేక తెగ ఇబ్బంది పడిపోయేవాడట. స్వరపేటికను తొలగించడం వల్ల మాటలు రావడం కష్టమైనా గాస్ట్రిక్ స్పీచ్ పద్ధతిలో అతనికి మాటలు నేర్పగలమన్న ఆశాభావం డాక్టర్లు వ్యక్తపరుస్తున్నారు. 50 వేలకు పైగా ఖర్చయ్యే ఈ ఆపరేషన్‌ను నెల్లూరు అపోలోలో కేవలం 11 వేలకే చేసినట్లు మెడికల్ డైరక్టర్ ఎస్. చంద్రశేఖర రెడ్డి చెప్పారు. అంతకు ముందు నాలుక, గొంతులకు మాత్రమే ఈ శస్త్ర చికిత్స చేసేవారట. బెంగుళూరు, బొంబాయి, మణిపాల్ వంటి ఆసుపత్రులలో అత్యధిక వ్యయంతో ఈ ఆపరేషన్లు ఒకటి, అర మాత్రం జరిగాయట. ఈ అపూర్వ ఆపరేషన్లు డా. శ్రీధర్ రెడ్డి, డా. ప్రకాష్‌లతో పాటు డా. కృష్ణమూర్తి, డా. శివకుమార్ చేశారు. రోగి ఇక నుండి వుల్లాసంగా తన వుద్యోగానికి కూడా హాజరు కావచ్చని డాక్టర్లు భరోసా ఇచ్చారు.

### పొట్టి శ్రీరాములు వర్ధంతి

మూలపేటలోని పొట్టిశ్రీరాములు విగ్రహం వద్ద 15 తేది 'అమరజీవి' 40 వ వర్ధంతి సభ జరిగింది. తొలుత పోలీస్ సూపరింటెండెంట్ శ్రీ టి. కృష్ణప్రసాద్ పొట్టి శ్రీరాములు విగ్రహానికి పూలమాల వేసి నివాళులర్పించారు. సభలో మాట్లాడిన ఒంగోలు ఎమ్పీ శ్రీ మాగుంట సుబ్బరామరెడ్డి 'అమరజీవి' రాష్ట్ర అవతరణకు చేసిన ప్రాణత్యాగం మరవలేనిదని ప్రస్తుతించారు. జిల్లా జడ్జి శ్రీయుతులు ఇస్మాయిల్, మునిసిపల్ కమిషనర్ శ్రీ జి. రామనారాయణ రెడ్డి, శ్రీ వామ్మెన సుబ్రహ్మణ్యం తదితరులు కార్యక్రమంలో పాల్గొన్నారు. పాండురంగ అన్నదాన సమాజం ఆధ్వర్యంలో జరిగిన మరో కార్యక్రమంలో పలువురు వైశ్య ప్రముఖులు ఆత్మకూరు బస్టాండు వద్ద గల 'అమరజీవి' విగ్రహాన్ని పూలమాలలతో నింపారు. జిల్లా పేరును 'పొట్టి శ్రీరాములు' జిల్లాగా మార్చాలని ప్రతిజ్ఞ చేశారు.

### బాస్కెట్ బాల్ పోటీల్లో నెల్లూరు బాలికల ప్రతిభ

రాష్ట్ర గ్రామీణ బాస్కెట్‌బాల్ పోటీల్లో నెల్లూరు స్పోర్ట్స్ అథారిటీ బాలికల జట్టు నాలుగోసారి విజయం సాధించింది. గుంటూరు బ్రహ్మానంద రెడ్డి స్టేడియంలో ఈ నెల 6 వ తేదీ జరిగిన పోటీల్లో కృష్ణాజిల్లా జట్టును 30 - 29 స్కోరుతో నెల్లూరు జట్టు ఓడించి ప్రథమ స్థానం పొందింది. విజయం కోసం జట్టు తీవ్ర పోరాట పటిమ చూపించింది. జట్టులోని శారద అనే క్రీడాకారిణి తాను ఒక్కతే 12 పాయింట్లు తెచ్చి సహకరించింది. శ్రీహరికోటకు చెందిన అయిదుగురు ఈ జట్టులో వున్నారు. 1989 నుండి ఈ జట్టు ప్రథమ స్థానం సాధించడం విశేషం. ఈ పోటీల్లో ప్రతిభ కనపరచిన ముగ్గురు బాలికలను రాష్ట్ర జట్టుకు కూడా ఎంపిక చేశారు.

### 50 ఏళ్ళ క్రితం

(10 పేజీ తరువాయి)

రంగనాయకమ్మకేప్రశ్న?... *[heading printed damaged, reads: రం॥॥నేపి]*

### నగరజ్యోతి స్టాండర్డు!!

నగరజ్యోతి (సత్రంగోదవ్రాత) ని గూర్చి దాని రచయిత ఇంద్రగంటి సుబ్రహ్మణ్యం గారిని గూర్చి సహృదయంతో వ్రాసిన దానికి 'శిసరి' లో డిఫెన్సు కావలసి వచ్చుట మాత్రం సంతాపకరం. అయ్యవారిని చేయబోయి కోతిని జేసిన విధం చూడండి. ''పండి లేదు కాబట్టి'' అన్నారు. అంటే డబ్బుతీసుకొని ప్రకటనలు వేసినారనే నిగ్గుతేలుతున్నాదా? యిది నేను ఆరోపించని కళంకము.

యిక వాదానికి వస్తాం - క్యాన్‌వాస్ చేస్తే అంతకంటే ఎక్కువ ప్రకటనలు వచ్చి వీడున్నవా?

డబ్బు తీసుకొనే - నిష్కామకర్మతోనే వీరి అంటీస్ శెఫ్‌లో చిరుతిండి దినుసులు రంగు రంగు దాకులతో వ్రాస్తే మనకేంసంబంధం? వీరన్నట్లు గోడకు ఒక Standard వుండబట్టి దానిని క్రింద చేయ వద్దని అభిలషించడం.

* * *

### ఓరుగంటి వెంకటేశ్వర్లు అస్తమించారు!

అబ్బా!నెల్లూరుకు -కాదు - అఖిలాంధ్రావనికే ఒక ఉజ్వల జ్ఞానతార అస్తమించింది. దేశభక్తులు, కారాగారమున మ్రగ్గుచున్న వెంకట సుబ్బయ్యగారి తృతీయపుత్రుడు 35 ఏండ్లకు దివ్యలలో గలుస్తూ వయస్సుకు మించిన విజ్ఞానాన్ని ఇహంలోదిగ విడిచిపోయినారు. విజ్ఞానవాతావరణం చీకటిముసుగుతో విలపిస్తున్నది నేడు! వెంకటసుబ్బయ్యగారి భాగ్యం తేజోవంతులైన పుత్రులు- వారిలో వీరు అవంతసులు; దీనికి మెరుగు-విజ్ఞాన దీపితమైన అణకువ, ఎదిరినిగూడ ద్రవింపజేసే సహృదయము. పరిచితులపట్ల జూపు వాత్సల్యము మధురతమము వీటికి వయస్సు కారణమే కాదు పొమ్మన్నాడు భర్తృహరి. ఇక పూర్వపుణ్యపరిపాకంా జననీ జనకుల నోముపంట.

-హలికుడు

### చిత్రసమీక్ష

(2 పేజీ తరువాయి)

చిత్రం టైటిల్ అంత స్పీడుగా లేదు. 'చలిగాలి కొట్టిందే హోరామ' 'హ్యాపి హ్యాపి చేయరా' అనే వాటితో పాటు భువన చంద్ర వ్రాసిన టైటిల్ పాటలు మాల్గుడి శుభ పాడడంవల్ల బాగున్నాయి. రాజ్-కోటి సంగీతం పరవాలేదు. లోకేసింగ్ కెమెరాలో ప్రాణం పోసుకున్న సన్నివేశాలకు అనిల్ మన్నాడ్ బాగా కూర్చ చేయలేకపోయారు. ప్రతి పాటలోను వెరైటి సెట్టింగ్ వేసి కళాదర్శకుడు సూర్యకుమార్ ప్రతిభ కనపర్చారు. హరి ఫైట్లు, సుందరం, తార నృత్యాలు చప్పగా ఉన్నాయి. నటుల్లోఫస్టుమార్క్ విలన్‌గా నటించిన కోటశ్రీనివాసరావుదే. సరికొత్త విలన్ పాత్రలో 'కోట'ను మనం చూస్తాం. సుమన్ 'అలెగ్జాండర్' పాత్రకు సరిపోయినా అక్కడక్కడా పూర్తిస్థాయి నటన చూపలేకపోయారు. కా.మొ. (కాబోయే మొగుడు) అంటూ హీరో ప్యాంటు మార్చుకుంటుంటే మంచం క్రింద చేరి వెర్రికేకలు పెట్టడం, వానపాటల్లో రంజాగ్గా ఒళ్లు చూపించడం వంటి సన్నివేశాలలో, వాణివిశ్వనాథ్ మాత్రమే సరిపోయింది. త్యాగిగా మల్లికార్జునరావు కామెడి పండితే, బాబుమోహన్‌కు 'కోటశ్రీనివాసరావు'చేత తన్నులు తినడానికే సరిపోయింది. నూతన్‌ప్రసాద్, బాలయ్య, విద్యాసాగర్, అన్నపూర్ణ తదితరులు మామూలుగా నటించారు.

❋

## జనవాణి

(3 పేజీ తరువాయి)

అభివర్ణించ వచ్చు. ఇందుకు కారణభూతులైన వారిని బహిరంగంగా కఠినంగా శిక్షించాలి. రాజకీయ బలాబలాల లబ్ధికై ప్రపంచ వ్యాప్తంగా దేశం పరువు దిగజార్చిన మత పార్టీల తీరు గర్హనీయం. కొందరు ఈ సమయంలో ప్రధాని శ్రీ పి.వి. నరసింహారావును రాజీనామా చేయమని కోరడం శోచనీయం. అయోధ్య సమస్య సయోధ్యకై ఆయన పదవి స్వీకారం చేసినప్పటి నుండి చేసిన కృషి అనన్యసామాన్యం. ఓట్లకోసం నానా రకాల గడ్డితినే పద్ధతులను పార్టీలు మానుకోకపోతే ప్రజాస్వామ్యం మంట కలసి పోవడం తథ్యం.

-బి. కొండయ్య

కావలి.

### బి.జె.పి.కి బాబర్‌కు తేడా లేదు

400 సంవత్సరాల క్రితం రాచరికం భారత దేశంలో రాజ్యమేలుతున్నప్పుడు బాబర్ అయోధ్యలో మందిరం ధ్వంసం చేసి మశీదు కట్టాడట. శతాబ్దాలు కాల గర్భాన కలసి సామ్రాజ్యాలు అంతరించి పోయాయి. మానవుని మేధస్సు దినదిన ప్రవర్ధమాన మయ్యింది. అంతరిక్షంలో అణువణువునా శోధించి ఎన్నో అబ్బుర పరిచే విషయాలు ప్రపంచానికి తెలియ చేస్తున్నారు. ప్రపంచపటంలో చిటికెడంత లేని దేశాలు అద్భుతాలు సృష్టిస్తుంటే, సనాతన సాంప్రదాయాలకు అలవాటైన స్వార్థచేతులలోని ప్రజలను కొన్ని పార్టీలు మతం మత్తులో, మద్యపాన కైపులో ముంచుతున్నాయి. ప్రస్తుతం ఒక పార్టీవారైతే మసీదును పగులగొట్టి తెగ పుప్పొంగిపోతున్నారు. ఇదా అభివృద్ధి? ఇదా విశ్వమానవతా మహోన్నత వాదం! బాబర్‌ను దురాక్రమణ దారని వర్ణించిన పార్టీకి, గత వారంలో రాజ్యాంగాన్ని, న్యాయస్థానాలను మోసపుచ్చి, తాను చేసిన దుర్మార్గపు పనికి తేడా తెలియలేదేమో!

ఎం.సుందరరామిరెడ్డి.

-లేబూరు

### మతం పేరిట మారణ హోమం తగదు

రాతి విగ్రహం రక్షిస్తుందా? పూజా మంత్రం బువ్వ పెడ్తుందా! అంటూ సమకాలీన పరిస్థితులను క్షుణ్ణంగా అవపోసన పట్టిన హేతువాదులు కొండబద్దలు కుట్టినట్లు చెబుతున్నారు. మంచి-చెడులను విశ్లేషించుకునే స్థాయిలో వున్న నేటి యువత అధికారపీఠం పేరిట మారణహోమం సృష్టించేంచే ఈ అరాచక శక్తుల వెనుక నడవడం బాధాకరం. ఈ దుష్కృతికి వేలాది మంది ప్రాణాలు గాలిలో కలిసాయి. సమస్యలతో సతమతమవుతున్న ఈ దేశంలో రాముడు ఇంత నరమేధం సృష్టించి ఆలయం కట్టమని ఎవరిని అడిగాడు. ఏదిఏమైనా ఈ విపత్కర పరిస్థితులలో జాతిని సముదాయించి పరిస్థితులు చక్కదిద్దిన మహా మేధావి శ్రీ పివి నరసింహారావును అభినందించక తప్పదు.

- పి. అరుణమ్మ

నెల్లూరు.

### ఎన్టీఆర్ ప్రజాద్రోహి!

రాష్ట్ర మాజీ ముఖ్యమంత్రి శ్రీ ఎన్టీరామారావు ఇటీవల ప్రధాని శ్రీ పి.వి. నరసింహారావును 'దేశద్రోహి' గా వర్ణించి తన రాజకీయ అవగాహనా స్థాయిని మరోసారి తేటతెల్లం చేసుకున్నారు. నాలుకపై నరం లేనట్లుగా మాట్లాడే ఈయన పలుకులు అతడి ప్రవృత్తికి నిదర్శనాలు. సన్యసిస్తున్నానని చెప్పి చలన చిత్రాల్లో శృంగార రసస్వాదనకు డ్రస్ అడ్డమని, మళ్ళీ ఏదో ఒకమాట చెప్పి నిర్లజ్జగా తెల్లబట్టలు ధరించారు. ప్రస్తుతం ప్రజాసేవ అనేది చేతి అముదం కారాదన్న సిద్ధాంతానికి కట్టుబడి షూటింగ్ విరామ సమయాల్లో రాజకీయాల్లో నటిస్తున్నారు. తమ పార్టీ ఎమ్మె రేణుకా చౌదరిని తెలుగు సారా ఉద్యమ కెప్టెన్ చేసి ఉద్యమం తామే నడుపుతున్నట్లు భ్రమ కల్పిస్తున్నారు. ఒకమారు హిందూ సంప్రదాయాన్ని పురస్కరించుకొని కాషాయాన్ని ధరించి, సన్యాసిగా ప్రకటించుకొని తిరిగి తెల్ల బట్టలు వేసుకోవడం ఎంత ఆత్మద్రోహమో! అది ఆయనకే చెల్లింది. అలాగే కోట్లాది రూపాయల నల్లడబ్బును తన క్రింద వేసుకొని సంపాదనను దినదినాభివృద్ధి చేసుకొంటూ 'ప్రజాసేవ' అనే వ్యాపారం చేస్తున్న ఎన్టీ ఆర్ నిజంగా ప్రజాద్రోహి!

-శారదాకుమార్

నెల్లూరు.

### బంద్‌లను బంద్ చేయాలి

ఈ మధ్య ప్రతి చిన్నవిషయానికి బంద్ చేయడం పరిపాటయ్యింది. వీటివల్ల ఎంతమంది ప్రజలు ఎన్ని రకాల కష్టాలు పడుతున్నా రన్న స్పృహ బంద్‌లు నిర్వహించే ఏ ఒక్కరికీ లేకపోవడం శోచనీయం. వాస్తవంగా ఈ బంద్‌లవల్ల దేశ ఆర్థిక పరిస్థితి చిన్నాభిన్నమవుతున్న విషయాన్ని అందరూ గమనించాలి. ఏ రాజకీయ పార్టీ బంద్ చేసినా ఆ సమయంలో ఈ నిబంధనలు పాటిస్తే బాగుంటుంది. ఫలహార, భోజనశాలలను బంద్‌నుంచి మినహాయించాలి. ఆసుపత్రికి పోయే పనులున్నవారు ప్రిస్క్రిప్షన్ చూపిస్తే వదలివేయాలి. బంద్‌లవల్ల రోజుకూలీ కోల్పోతున్నందున ఏ పార్టీ అయితే బంద్‌కు పిలుపు నిస్తుందో వారు కూలీపై బ్రతికే వారికి 15రూపాయలు ఇవ్వాలి. అల్లరిమూకలు విధ్వంసానికి పాల్పడకుండా బంద్ నిర్వాహకులు ఆయా పార్టీల జిల్లా అధ్యక్షుల చేత సంతకం చేసిన గుర్తింపు కార్డులు ధరిస్తే బాగుంటుంది

-ప్రభంజన్

నెల్లూరు.

### నీతి మాలిన రాజకీయాలకు జాతి బాధ్యత వహించాలా?

భారత దేశంలోని రాజకీయ పార్టీలకు ప్రజాస్వామ్యం, రాజ్యాంగం, న్యాయవ్యవస్థ అంటే గౌరవం లేకపోవడం అత్యంత దురదృష్టకరం. జాతిని నడపవలసిన పార్టీలు నీతి మాలిన రాజకీయ లబ్ధి కోసం జాతిని మొత్తం క్షోభ ననుభవించే కార్యాలకు సిద్ధపడు తున్నాయి. బాబ్రీ మశీదు విధ్వంస కార్యక్రమం ప్రపంచ వ్యాప్త సంక్షోభానికి నాంది పలికింది. బంగ్లాదేశ్, పాకిస్థాన్‌లలో ప్రతిచర్యలు దేశీయుల హృదయాల్లో ఆందోళన రేకెత్తిస్తున్నాయి. దేశ వ్యాప్తంగా ఇప్పటి వరకు జరిగిన దారుణ, మారణ కాండకు అంతే లేకుండా పోయింది. ఏది ఏమైనా నీతి మాలిన రాజకీయాలకు నాయకులు స్వస్తి చెప్పాలి. దేశ ప్రజలు, ఆలయాలు, మశీదుల రక్షణకు తక్షణ చర్యలు తీసుకోవాలి.

— బి. పట్టాభిరామయ్య

నెల్లూరు

### పోస్ట్‌బాక్స్‌లేని పోస్టాఫీసు

టౌన్‌లోని బాలాజీనగర్ సబ్‌పోస్టాఫీసు అందరికీ అందుబాటులో వున్న ప్రదేశంలో పెట్టారని ఆనందించాం. కాని పోస్టాఫీసులో మొట్టమొదట వుండవలసిన 'పోస్ట్‌బాక్స్' లేకపోవడంవల్ల పోస్టాఫీసులో కూర్చొని వుత్తరం రాసి అక్కడి నుండి 100 గజాలు నడచి, విద్యుత్ స్థంబానికి కట్టి వున్న బాక్స్‌లో వుత్తరాలు వేయాల్సిన దుస్థితి ప్రస్తుతం దాపురించి వుంది. ఆఫీసు వద్దే బాక్స్ ఏర్పాటు చేయాలన్న కనీస స్పృహ ఆ శాఖకు లేకపోవడం విడ్డూరమే. ఇకనైనా పరిస్థితి చక్కదిద్దుతారని ఆశిస్తాము.

— నాగరాజు

నెల్లూరు

### గూడూరు ట్రాఫిక్ సమస్య

గూడూరు మునిసిపల్ టౌన్‌లో ట్రాఫిక్ సమస్య నానాటికీ జటిలమవుతుంది. దూడల కాల్వ మలుపు వద్ద ప్రతి ఉదయం సాయంత్రం గంటల తరబడి ట్రాఫిక్ నిలబడి పోతున్నది. దీనివల్ల ఆర్టీసి బస్టాండ్, వివిధ ఆఫీసులకు వెళ్ళే ప్రయాణీకులు, ప్రజలు ఇక్కట్లు పాలవుతున్నారు. గాంధీ బొమ్మ దగ్గర కూడా ఇదే సమస్య ఉత్పన్నమవడంవల్ల కాలేజీకి వెళ్లే విద్యార్థినులు, ఆ దారిన పోయే రిక్షా కార్మికులు సమస్యలు ఎదుర్కొంటున్నారు. ఈ రెండు ప్రాంతాలలో ట్రాఫిక్ పోలీసులను నియమిస్తే సమస్య పరిష్కార మవుతుంది.

-షేక్. మహబూబ్ బాష

కలిచేడు.

## అత్తమీదకోపం

(2 పేజీ తరువాయి)

ఎమ్మెల్యేలు దిక్కు తోచక నాలుక్కరుచుకున్నారు. వాస్తవానికి ఈ రిపోర్టు ఇంతకు ముందే వార్తా పత్రికల్లో 'లీక్' అయింది. అసెంబ్లీలో నివేదిక వెల్లడించడం వల్ల స్థానిక ఎమ్మెల్యేల పై వచ్చిన ఆరోపణలు అధికారికంగా ధృవపడతాయి. ఈ ముప్పు నుంచి తప్పించుకునేందుకు వేరే మార్గాంతరం లేక దోషులుగా నిర్ధారించ బడిన ఎమ్మెల్యేలు దీన్ని 'రాజకీయం' చేసి నీరు గార్చాలని ప్రయత్నిస్తున్నారు. నిజానికి అన్సారీ రిపోర్టులో తమ ప్రస్తావనే లేదని, తాము అసమ్మతితో చేతులు కలిపినందుకు అప్పటి ముఖ్యమంత్రి నేదురుమల్లి కక్షసాధింపుగా రిపోర్టును తారు మారు చేసి, తమను దోషులుగా ఇరికించారని ఎమ్మెల్యేలు బాంబు పేల్చారు. ఎలాగూ రిపోర్టును తారుమారు చేశారు కాబట్టి ఎన్టీఆర్ థియేటర్ విధ్వంసం పై తిరిగి కొత్తగా విచారణ జరపాలని కూడా ఎమ్మెల్యేలు కోరుతున్నారు. అసమ్మతి నాయకులైన డాక్టర్ వై. ఎస్.రాజశేఖర రెడ్డి, ద్రోణంరాజు సత్యనారాయణ ప్రభృతులు కూడా తమ వర్గీయులైన సుధీర్, ముఖీమ్‌ల వాదనను బలపరుస్తూ, నేదురుమల్లి జనార్దన రెడ్డిని తప్పుబడుతూ పత్రికా ప్రకటనలు గుప్పిస్తున్నారు. అన్సారీ రిపోర్టు మంత్రి వర్గ సమావేశంలో పెంచినపుడు పలువురు మంత్రులు రిపోర్టును ఆమోదించరాదని అడ్డు పడ్డారట. కన్నా లక్ష్మీ నారాయణ, హరి రామ జోగయ్య, సంతోష్ రెడ్డి, సి. రామచంద్రా రెడ్డి ప్రభృతులు ఈ రిపోర్టును ఆమోదిస్తే కాంగ్రెస్ ఎమ్మెల్యేలు ఇరుక్కుంటారు. కాబట్టి దీన్ని మూల పడేయాలని గట్టిగా వాదించారట. అయితే కాంగ్రెస్ ప్రభుత్వం నియమించిన కమీషన్ రిపోర్టును మూలపడేస్తే పార్టీ అప్రతిష్ట పాలవుతుందని, రిపోర్టును ఆమోదిం చడమే శ్రేయస్కరమని ముఖ్యమంత్రి కోట్ల అందర్నీ ఒప్పించి మరీ రిపోర్టుకు ఆమోద ముద్ర వేయించారట. అయితే అత్తమీద కోపం దుత్త మీద చూపించినట్లు కోట్లను ఏమీ అనలేని ఎమ్మెల్యేలు జనార్దన రెడ్డి పై దుమ్మెత్తి పోస్తున్నారు. ఎలాగైనా రాజకీయాన్ని పులిమి రిపోర్టుకు విలువలేకుండా చేయాలన్నది ఎమ్మెల్యేల వ్యూహంగా కనబడుతోంది. అయితే రిపోర్టును తారుమారు చేసే ప్రశ్నే తలెత్తదని, ఒక వేళ ఎమ్మెల్యేల పై కోపం వుండి వుంటే తన హయాంలోనే నివేదిక బయట పెట్టి ఎమ్మెల్యేలను సాధించి వుండాల్సిదని మాజీ ముఖ్యమంత్రి వాదించారు అసలైన కాంగ్రెస్ వాదిగా పార్టీలో ఐకమత్యం కాపాడి, పార్టీ ప్రతిష్టను ఇనుమడింప జేయడానికే అన్ని వేళలా ప్రయత్నం చేశానని మాజీ ముఖ్యమంత్రి అంటున్నారు. నివేదిక అందగానే దాన్ని ప్రభుత్వ ప్రధాన కార్యదర్శికి అందజేశామని, ఆయన దగ్గర నివేదిక భద్రంగా వుందని, దాన్ని తారుమారు చేసే ప్రశ్నే తలెత్తదని జనార్దన రెడ్డి చెబుతున్నారు. అసమ్మతి కార్యకలాపాలు మమ్మురంగా వున్న రోజుల్లో అన్సారీ రిపోర్టు బయట పెట్టాల్సిందిగా జనార్దన్ వర్గీయులు వత్తిడితెచ్చినా జనార్దన రెడ్డి మాత్రం అంగీకరించ కుండా ఎమ్మెల్యేలను కాపాడేందుకు జాప్యం చేసి, నివేదికను తొక్కి పెట్టారు. దానికి జనార్దన రెడ్డి ఇప్పుడు మూల్యం చెల్లించుకోవాల్సి వస్తోందని అంటున్నారు.

## తెలుగుదేశం

(2 పేజీ తరువాయి)

చంద్రమోహన్ రెడ్డికి ఇబ్బంది కల్గించే పరిణామమే. పోలీసు ఎస్ఐ కూడా ప్రతిపక్ష పార్టీ నాయకుడని గుర్తించలేనంతటి ఐక్యపలుచటి దేహదారుఢ్యం ఆయనది. ఇక కార్యకర్తలు ఎట్లా గుర్తించ గలరు?

ఈ నియామకం పార్టీలో అసంతృప్తికి దారితీస్తున్నది. నల్లపరెడ్డి చంద్రశేఖర్ రెడ్డి, టీగా నారసింహారెడ్డి గారలు తప్ప వేరెవ్వరూ చంద్రమోహన్ రెడ్డి నియామకం పట్ల సంతృప్తిగాలేరు. యువకులలో అసంతృప్తి మరీ హెచ్చుగా వుంది. ఒక వర్గానికి అనుబంధితుడు కావడంతో ఇంత కాలం అధిక సంఖ్యాకులు ఆయనతో సాన్నిహిత్యం పెంచుకోక, దూరంగా మసలారు. వారిని కలుపుకొని పోవడం అంత సులభం కాదు కొత్త అధ్యక్షుడికి! అయితే ఇప్పట్లో ఎన్నికలు లేవు కాబట్టి జిల్లా అధ్యక్షుడి పై పెద్ద భారం పడే ప్రమాదమేదీ లేదు. పత్రికలలో పార్టీని బ్రతికిస్తే చాలు. అది చంద్రమోహన్ రెడ్డికి మంచి నీళ్ల ప్రాయం.

### సవరణ

20.11.92 తేది జమీన్‌రైతు 8 పేజీ, బహిరంగవేలం ప్రకటన 9 వ అయిటము, 11/12/92 తేది జమీన్‌రైతు 7 వ పేజీ బహిరంగవేలం ప్రకటన 7 వ అయిటములో బి. మంగల్ చంద్ జైన్‌గా సవరించుకొని చదువుకోవలసిందిగా మనవి.

కె.వి. రామకృష్ణారావు
ప్రభుత్వము నియమించిన వేలముదారు
11/268, సంతపేట, నెల్లూరు

## కళ్యాణం



నెల్లూరు స్వస్థలం, హైదరాబాద్ వాసి ప్రముఖ కాంట్రాక్టర్ కొండూరు సాయిమోహన్ రెడ్డి గారి కుమార్తె సౌభాగ్యవతి మల్లిక, నెల్లూరు, మోపూరు రఘునాథ రెడ్డి గారి తనయుడు చిరంజీవి ప్రమోద్ కుమార్ వివాహం నెల్లూరు టి.టి.డి.లో డిశంబర్ 3 తేదీ వైభవంగా జరిగింది. ఆం.ప్ర. హోమ్ శాఖామాత్యులు డాక్టర్ మైసూరా రెడ్డి, మాజీ పార్లమెంటు సభ్యులు శ్రీ గంగుల ప్రతాప్ రెడ్డి, ఒంగోలు పార్లమెంట్ సభ్యులు మాగుంట సుబ్బరామిరెడ్డి సోదరులు మరియు ఎందరో ప్రముఖులు వివాహమునకు విచ్చేసి ఆశీర్వదించారు.

# ఏనుగ వెంకట నరసారెడ్డి గారి

# శతజయంతి



ఏనుగ వెంకటనరసారెడ్డి గారు

జననం: 17.12.1892 మరణం : 04.12.1976

## సంస్మరణ

వీరు బుచ్చిరెడ్డిపాళెం సమీపంలోని పల్లాప్రోలు గ్రామంలో సామాన్య వ్యవసాయ కుటుంబములో జన్మించి స్వయంకృషితో గూడూరులో అగ్రశ్రేణి మైకా వ్యాపారిగా పేరు పొందారు. ఈ శతాబ్దపు 30 వ దశకంలో జిల్లాలో ప్రముఖ స్థానంలో వుండిన "స్టాండర్డ్ మైకా కంపెని" ని జిల్లా ప్రముఖులు తిక్కవరపు రామిరెడ్డి, సిద్దవరపు రామలింగారెడ్డి గార్లు భాగస్థులుగా నిర్వహించారు. స్వయంకృషితో హిందీ, ఇంగ్లీషు భాషలలో తగు పరిచయం సంపాదించుకొన్నారు.

గాంధీ మహాత్ముని పిలుపునందుకొని నిరంతర ఖద్దరు ధారణ. అస్పృశ్యతా నివారణ వంటి నిర్మాణ కార్యక్రమాలలో చిత్తశుద్ధితో పాల్గొనే వారు. వీరి కుటుంబమంతా ఖద్దరు దారులే వారి సతీమణి రామమ్మగారు స్వయంగా రాట్నం మీద నూలు తీసే వారు. కొంత కాలం హరిజన విద్యార్థులకు హాస్టలుని స్వయంగా గూడూరులో నిర్వహించే వారు. గూడూరు టవున్ కాంగ్రెస్ కమిటీ అధ్యక్షులుగా చాలా కాలం పని చేశారు.

1941 సంవత్సరంలో గాంధీ మహాత్ముని వ్యక్తి సత్యాగ్రహోద్యమంలో పాల్గొనటమే గాక అప్పట్లో గూడూరుకు వచ్చి పోయే కాంగ్రెసు కార్యకర్తలకు సత్యాగ్రహులు అందరికి భోజన వసతి సదుపాయాలకు OPENHOUSE నిర్వహించారు. ఆ వుద్యమంలో వీరి ప్రత్యేకత ఒకటి. అప్పటి గూడూరు సబ్ కలెక్టర్ గెల్లెటీ గారు వితండ వాదనతో వీరిని అరెస్టు చేయ నిరాకరించారు. ఇందుకు ప్రతిగా వీరు యుద్ధ వ్యతిరేక ప్రచారంతో ఢిల్లీ వరకు పాదయాత్ర ప్రారంభించారు. కాని ప్రభుత్వం గెల్లెటీ గారి వాదన నంగీకరించక వీరు నెల్లూరు చేరు కొనేటప్పటికి అరెస్టు చేసి మూడు నెలలు శిక్ష విధించి బళ్లారి సెంట్రల్ జైల్‌లో నిర్బంధించారు.

మనుబోలులో హై స్కూలు వీరి పేరుతో స్థాపించారు. గూడూరు మహిళా సభ. భవనం నెల్లూరు అనాద శిశు శరణాలయం కస్తూరి దేవి విద్యాలయం పల్లాప్రోలులో పాఠశాల వగైరాలకు వీరు ఎంతో విరాళమిచ్చి సహాయపడ్డారు. గూడూరు హై స్కూలు భవన నిర్మాణానికి వీరి విరాళం చెప్పుకో తగినది. ఇవిగాక గుప్త దానాలెన్నో. రాజకీయ బాధితులకు ఇచ్చే ఐదెకరాల భూమిని ఆశించక నిరాకరించిన త్యాగి.

కపటం తెలియని వ్యక్తి చేసే పనిని కల్లాకపటం లేకుండా చిత్తశుద్ధతో చేయడం వీరి ప్రత్యేకత. "నిండు మనంబు నవ్య నవ్యనవనీత సమానము పల్కులు రుణాఖండాల శస్త్రతుల్యము" అనే నన్నయ గారి వర్ణన వీరికి బాగా అతుకుతుంది.

Edited, Printed and Published by N. Dolendra Prasad at Zamin Ryot Press, Nellore OFFSET Printing at Nayagara Books (Pvt) Ltd.